

# ఆంధ్ర
# దూర్వాసరామాయణము

కృతిభర్త.—

శ్రీ మన్నె సత్యనారాయణమూర్తి జమీందారు,

కొడమంచిలి.


కృతికర్త:

కవిభూషణ, శిష్ట్లా వేంకటసుబ్బయ్య,

పైలరున్నత పాఠశాలాంధ్ర పండితుఁడు.




[వెల 2-0-0

# అవతారిక

మాగామగ్రామకాపరస్థులు, బ్రహ్మశ్రీ పారుపూడి చలమయ్య శాస్త్రిగారు కొండొకతఱి నరసాపురములోఁ బురాణింపఁదొడఁగిరి. అది దూర్వాసవిరచిత రామాయణము. సంస్కృతము. కథ చంపకా పరిణయము. ఆకథ హృదయంగమమై యెల్లవారల నొక్కుమ్మడిగా నాకర్షించినది. అయ్యానందమునఁ బాల్గొన్నవారిలో నేనొకఁడను.

మరునాఁడు శాస్త్రిగారిని దర్శించి యాగ్రంథప్రతి నాకిమ్మని కోరితిని. సహృదయులగువారు పొత్తమును వెంటనే నాకొసంగిరి. గ్రంథమంతయు వ్రాసికొంటిని కాని యందు 2, 3, 4, 14, 15, 18 సంఖ్యలుగలయధ్యాయములు మాత్రమే గలవు. అయ్యవియు నిర్దుష్టముగా లేవు. సంపూర్ణప్రతికి సర్వవిధముల యత్నించితి కాని లభింపలేదు. అంతవఱకే తెనిఁగింప నెంచితి.

ఇతఃపూర్వము బృహత్కథనుండియేని కథాసరిత్సాగరమునుండి యేని విక్రమార్కకథలనుండియేని వింతవింతకథలు వెల్వడినవి. ఇందలి కథల స్వరూపముకూడఁదాదృశమే. అన్నింటియందొకేవిధమగుకథలు పొడగట్టెడిని. కావున నవ్వానికెల్ల దూర్వాసరామాయణమే మూలమై యుండనోపు. ఏదియెట్లున్నను కథలు హృదయంగమము లనుట విస్పష్టము.

రసగ్రహణపారీణు లిందలిరసమునే గ్రహింపఁ బ్రార్థితులు.

ఈ గ్రంథ ప్రాశస్త్యమును గుర్తించి ఇంటరుమీడియేటు స్పెషలు తెలుఁగునకుఁ బాఠ్యభాగముగా నిర్ణయించిన ఆంధ్రవిశ్వవిద్యాలయము వారి కేనెంతయుఁ గృతజ్ఞుఁడను.

నరసాపురము,
15—8—44.

బుధజనవిధేయుఁడు,
శిష్ట్లా వేంకటసుబ్బయ్య.

శ్రీ

# కృతిసమర్పణము

శ్రీమన్మన్నికలాంబురాశికుముదశ్రేణీసఖా ! ద్విత్రస
ద్గ్రామాధీశ్వర! శాంతసత్యవినయౌదార్యాది చంచద్గుణ
స్తోమా! మిత్రిమయూరవర్షసమసూర్యార్జత్వయోదాకృతీ!
యీమాసత్కృతికన్య, నేలుకొనుమోయీ! సత్యనారాయణా !

ఉ. ప్రాయముఁజూచికాదు, బహుభాగ్యముఁజూచియుగాదు, భూరివి
ద్యాయతిఁజూచికాదు, సుగుణావళికెల్ల మెఱుంగుఁబెట్టి యీం
పై యెసలారు నీ రసికతాధికతల్, గని యొప్పెఁగబ్బపుం
బ్రాయఁపుఁటింతి, యింతులవురా! రసికాగ్రణిఁగోరు టబ్రమే?

ఉ. రామచరిత్రియాట, నిది, రాజితకీర్తిఘటించు, సద్గుణ
స్తోముఁడ! శేముషీవిభవ! సూరిజనావనబద్ధకంకణో
ద్దాముఁడ మన్నిసత్కులసుధాజలధీంద్రశశాంకమూర్తి! యీ
రామచరిత్రి నీదగుకరంబునఁబెట్టెద, గారవింపుమా!

## ఉత్పలమాల

మచ్చిక జెప్పువాఁడ, విను, మాదగురామచరిత్ర నెన్నడన్
హెచ్చువిలాసముఁ సొగసు నీటుఁదనంబుఁబదప్రశస్తి పెం
పచ్చుపడంగఁబొల్చి యెపుడైనను దీపి ఘటించుఁగాని యే
పొచ్చెమునొచ్చెమున్, నెఱపఁబోవదుసుమ్మి, పతివ్రతాత్వసం
పచ్చరితంబునన్, మెలఁగుఁ బాయక నిచ్చలదెట్టిదందుమా
యెచ్చట నిల్వుమంచు వచియించిన నచ్చటనిల్చుఁ గాని, యే
రచ్చయురాపు దీసికొనిరా దొకముద్దినుసుల్ జరీబుటా
లచ్చికఁదెచ్చియిమ్మనుచు నాఱడిఁబెట్టదు తోడివంతునన్,

వచ్చితివాయటన్నను సపత్నులతోఁ గలహింపఁ బోక, త్రా
నచ్చికబుచ్చికన్ మెలఁగి యందఱిలో సమకూర్చు నిచ్చలున్
బొచ్చెము లేనికీరితినిఁ బుట్టినయింటికి, మెట్టినింటికిన్
ముచ్చటకైన నొక్కపరిఁబోయెదఁ బుట్టినయింటికంచు నో
ర్విచ్చి వచింపఁబోదు మృదురీతి నెసంగెడు కుల్కుపల్కులన్
మెచ్చు ఘటించు మీమదికి మిక్కిలిభారముదోఁచు వేళఁ బై
పెచ్చెటు సంచరించినను పృచ్ఛయొనర్ప దిదేమియంచు దీ
వ్యచ్చరితుల్ కవీశ్వరులు వారును వీరననేల యెల్లరున్
మెచ్చు మృదూక్తులే, పలుక నేర్చునుగాని, మఱిం గఠోరవా
క్యోచ్చయముల్ వచింప దెటులో మిన నన్యులకంటికింగడున్
మచ్చరమెచ్చఁగన్పడ దనంతగుణాన్విత, సాధ్వియిద్ది భా
స్వచ్చరితా! గ్రహింపుమిడఁబాయక మన్నకులాబ్ధిచంద్రమా!

కం. నెయ్యఁపుఁదియ్యంబున నే
నియ్యంగా నియ్యకొంటి నీకృతికన్యన్
వెయ్యేండ్లవఱకునున్ మన
వియ్యము లియ్యంబయగుచు వెలయు గుణాబ్ధీ!

శ్రీ ర స్తు.

# ఆంధ్ర
# దూర్వాస రామాయణము

---

శ్రీయుతుఁడై సురప్రకరసేవితుఁడై ఘనరత్నపర్వత
స్థాయుదుదారపీఠపరిభాసితుఁడై వెలుగొందు సత్యనా
రాయణదైవతంబు స్వసమాఖ్యను జెన్నగు మన్నసత్యనా
రాయణుఁ బ్రోచుఁగావుత నిరంతర మాయురభీష్టసిద్ధులన్. 1

శా. మాండవ్యాత్రిమరీచినారదమహామైత్రేయ మౌనీశ్వరో
ద్దండుల్ మెండుకొనం గెలంకుల జగల్లాభంకరప్రక్రియా
ఖండస్ఫూర్తి నెసంగు దివ్యసుషమాఘుం బాయురైశ్వర్యముల్
నిండారంగనొసంగి మత్కృతిపతిన్ నిత్యమ్ము రక్షించుతన్. 2

మ. గిరిజా! నీపతి యాదిభిక్షు వెటకేగెన్ జెప్పవేయంచు నిం
దిరపల్కన్ బలియజ్ఞభిక్షకయి యేతెంచెన్ సింధుజా! యంచు నీ
శ్వరి వాక్రువ్వఁ దదీయ వక్రవచన ప్రాగల్భ్య మూహించు నీ
శ్వరవిశ్వంభరు లోము మన్నకులభాస్వత్సింధుశుభ్రాంశునిన్. 3

చ. జలరుహగర్భుఁడున్ మఱియు సారసనేత్రుఁడు రుద్రుఁడీశుఁడున్
నలువురు నాల్గుకోళ్ళగుచు నల్వవహించిన మంచరాజమం
దలరు సదాశివాఖ్యఫలకాగ్రతలంబునఁ బ్రాభవంబునన్
వెలసెడు నాదిశక్తి కృతినేతకుఁ గూర్చుత మెల్లకోర్కులన్. 4

సీ. దారిద్ర్యదోషంబు వారించుజలజాక్షి
విశ్వంబుఁ బాలించు విశ్వగర్భ
పంకేరుహాపుట్టింటఁ బరిఢవిల్లెడి దంట
కలశపాథోరాశి కడుపుపంట

వివిధశ్రుతులచేత వినుతిఁ గైకొనుమాత
భోగాపవర్గ ప్రబోధచరిత
అసమసాయకుఁడైన కుసుమాయుధునితల్లి
కలితార్థిజనబృంద కల్పవల్లి

సీ. సకల గీర్వాణకోటి మస్తకకిరీట
ఘటితరత్నాంకుర ప్రభాపటలరాజి
తె పదపద్మయుగసతీమతల్లి లక్ష్మి
తాండవించు మత్కృతిపతిధామసీమ. 5

ఉ. విఘ్నధరాధరమ్ములకు వేని పదాబ్జము వజ్రధారయో
విఘ్నదవానలమ్మునకు వేని కరాగ్రము ప్రావృడబ్దమో
విఘ్నతమశ్చయంబునకు వేని యొడల్ రవిమండలంబొ యా
విఘ్నపతిన్ నుతింతు మదభీష్టపరంపర సొంపు ముట్టఁగన్. 6

చ. తలఁచినయంతమాత్ర లలితంపుఁబదమ్ములతో విలాసముల్
దొలఁకెడు కల్కి నెన్నడలతో సమలంకృతితోడవచ్చి నా
తలఁపున నిల్చి పొల్చి విబుధప్రతతిం గరగించి సద్యశో
విలసితుఁ జేయుమమ్మ! తొలివేలుపు ముద్దులగుమ్మ! భారతీ! 7

చ. కవులను పేరిటం బరఁగు కైరవకాననవీథులందు నీ
యవిరళ సత్కృపామృత సమంచితచంద్రిక గాయకున్న సూ
క్తి విసరమన్న వస్తువులు దెల్లములై కనుపట్టు టెట్టులో
వివరణసేయుమమ్మ! తొలివేలుపు ముద్దులగుమ్మ! భారతీ! 8

చ. లలితపదార్థవేదులఁ గళాకుశలాత్ములు సత్కవీంద్రు ల
గ్గలముగ నిన్నుపాసనలఁ గాంచి తరించిరి మంత్రతంత్రముల్
దెలియను భక్తిదక్క నుడితేనెల నావదనమ్మునుండి వే
వెలువడఁజేయుమమ్మ! తొలివేలుపు ముద్దులగుమ్మ! భారతీ! 9

ఉ. నన్నయభట్టుఁ దిక్కనను, నాచనసోముని, శంభుదాసుఁ బో
తన్నఁ, దదీయభావుకునిఁ, దక్కిన పూర్వకవీంద్రచంద్రులన్
గ్రన్ననఁ గొల్చి స్వాదుపదరాజరసోన్నతి యుప్పతిల్లఁగా
వెన్నెలసోలువెట్టెద నవీనకవీంద్రుల బుద్ధిమత్తకున్. 10

గీ. అనుచు దేవతాది నమస్కృ లాచరించి
దేవభాష దూర్వాసుండు దెలిపినట్టి
కలిత రామాయణములోని కథలు దొరకి
నన్ని చాయగాఁ దెనిఁగించి యున్నవేళ. 11

గీ. లోకవిజ్ఞానశేముషీలోచనుండు
ధవళతరకీర్త్యుపార్జనతత్పరుండు
మన్నె సత్యనారాయణ నన్నుఁ గూర్చి
యురుతరామోదనిర్ఝరు లుప్పతిల్ల. 12

ఉ. కోసలదేశవాసు లతిగుంభితసర్వకళాప్రసిద్ధు లు
ద్భాసిత ధీవిశేషులు తపస్తటినీపతు లాగమాంచితుల్
భాసురశాస్త్రకారకు లపారయశోంచితు లార్యపూజితుల్
కోసలనాటివారనఁగఁ గ్రాలుదు రీక్షితి వారిలోపలన్. 13

శా. స్రష్ట ద్రవ్యులఁ జోఁపు బుద్ధి గరిమన్ శాస్త్రార్థముల్ చేసి వి
స్పష్టప్రక్రియఁ దెల్పుచుండు సతమున్ జంచత్తపశ్శీలురై
శిష్టాచారరమాసమేతులయి వాసిం గాంచుటన్ భూస్థలిన్
శిష్టాచారను పౌరుషాఖ్యయొదవెన్ మీకో కవీంద్రోత్తమా! 14

కం. కౌండిన్యసగోత్రుం డు
ద్దండవిచక్షణుఁడు పరమధార్మికుఁడు లస
చ్చండీ యాగాధ్వర్యుఁడు
చండతపశ్శాలి మీకు జనకుండు గదా! 15

ఉ. చాయ దలిర్పఁ గావ్యములు శాస్త్రములుఁ బఠియించి మించి లేఁ
బ్రాయమునందె కాశినగరమ్మున నేరిచి మంత్రశాస్త్రముల్
హాయన సప్తకంబున దిగంతయశంబు గడించె సూర్యనా
రాయణశాస్త్రి శాంతగుణరాశికి నాతని కాత్మజుండవై. 16

సీ. ఘటియించినాఁడవు గద్యప్రబంధముల్
చిన్నయసూరితోఁ జెలిమిసేయ
వ్రాసినాఁడవు తొల్లి వాసవదత్తాఖ్య
నాటకంబును బుధకోటి మెచ్చ
అతకరించితి హృదయాభిరామాఖ్య ప్ర
బంధ ముజ్జ్వలరసాస్వదముగాఁగ
రచియించితివి వీరరసవాహినుల పొంగు
నఁ జెలంగు తిరుమల నాటకంబు

తే.గీ. జాను తెనుఁగుపదంబులు జాలువాఱ
ననువదించితి ఋషియొకం డాంధ్రభాష
సుబ్బకవిచంద్ర! మధురసత్సూక్తిసాంద్ర!
యనుచు నన్నొక పెద్దగా వినుతిచేసి. 17

చ. అలరెడు చంపకా పరిణయాఖ్యకథన్ విని కైతమెచ్చి యిం
పొలయఁగ నీయఁగావలయు నోకవిభూషణ! శాశ్వతంబునై
ఖిలమును గాకయుండి ఘనకీర్తి ఘటించెడు కబ్బమంచు నన్
జెలిమినిఁబల్కె రాముని ప్రసిద్ధకృతీంద్ర మొసంగ నెంచుచున్. 18

ఉ. స్థాయదభంగురోన్నత యశస్సముపార్జనశీలు సత్యనా
రాయణమూర్తి మన్నెసుకులాంబుధిచంద్రు జమీనుదారునిన్
జేయుచు మత్కృతీశునిగఁ జేసెదఁ దత్కులవర్ణనంబు వి
ద్యాయుతులుఁ గవీశ్వరు లుదారమనస్కులు బాపురే యనన్.

ఉ. ఆదిని నైష్ఠికోత్తముఁ డహంకృతిదూరుఁడు దివ్యమూర్తి కా
మాదికనామసంయమి యమానుషచర్యుఁ డఖండవేద వి

ద్యాదయితుండు ఘోరతప మాదట సల్పుచునున్న వేళఁ గ్రొ
వ్యాదికదంబకంబు భయదాకృతిఁ దాల్చుచు వచ్చి చెచ్చెరన్ 20

చ. తపమున కంతరాయసముదాయముఁ గల్పనచేయుచుండ న
త్తపసి సహింపలేక ప్రతితాపముఁ గూర్పులేక భక్తిమై
విపులదయాస్వరూపిణిని విశ్వజగచ్ఛ్రయమాత భక్తలో
కపరవశాత్మ నిందిరను గావను బ్రోవను వేఁడె వేల్మిడిన్. 21

సీ. కారుమబ్బులసొగుఁ గేరు వేనలితోడఁ
బున్నమనెలనేలు మోముతోడ
అపుడె విచ్చినతమ్మి నడకించు కనులతోఁ
బూవిల్తువింటి కన్బొమలతోడ
మావిచిగురుఁ గేరు మోవిసొంపులతోడ
మగఱాలఁ బోలు పల్సొగసుతోడ
మెఱపుఁదీవను మీఱు మేనిమిన్కులతోడఁ
బిడికిటనిముడు నెన్నడుముతోడ

గీ. రవరవలుసేయు రవల చిన్నగవుతోడ
కదలియల్లుని మిసిమిబంగారుబొమ్మ
కనులవిల్తునికన్నమ్మ కలిమిగొమ్మ
జానుతపసికిఁ గన్నులఁ గానుపించె. 22

గీ. శ్రీమహాలక్ష్మి కాశ్రీహరిప్రమదకు
క్షీరసాగరకన్యకుఁ జేయిమోడ్చి
జడలదారి రాక్షసబాధ నుడువుకొనఁగ
లచ్చి మెచ్చుచుఁ జెవికమ్మ నిచ్చె మునికి. 23

ఉ. బాహుబలప్రదర్శకులు పంచశతంబులవారు భాస్వర
ద్వ్యూహముతోడ ధీధనసమున్నతధైర్యముతోడ దీప్తిమ
త్సాహసశక్తితోడఁ బరిసర్పి గభీరగుణంబుతోడ దు
ర్గ్రాహులు లచ్చిదేవి చెవికమ్మ జనించిరి కమ్మవారలై. 24

కం. దితిసంతతిసంతతులను
హతమార్చుచు నైదునంద లమితబలాఢ్యుల్
మతిమంతులు ధృతిమంతులు
ప్రతిలేక వెలుంగఁదపసి వారలఁగనుచున్. 25

కం. నెమ్మి జనసమూహమ్మ!
కమ్మా! కమ్మా! నితాంత కాంతశ్రీయు
క్త మ్మవు ఘనధిషణో పే
తమ్మనటంచుఁగృప మెఱయఁదాపసిపలికెన్. 26

కం. ఉదుటు మెయిఁగమ్మవారన
ముదమొదవఁగఁదద్గుణములు మూరింబోవన్
విదితాత్ములైరి వీరలు
సదయులు ధనయుక్తులగుచు సన్మతలమందున్. 27

ఉ. ధీరుఁడు మన్నెభూపతి సుధీమణి భూసురదైవభక్తివి
స్తారుఁడు దానకర్ణుఁడు బుధప్రకరావనుఁ డుగ్రవైరిదు
ర్వారుఁడు వాసిరెడ్డికులవారిధిచంద్రుఁడు వేంకటాద్రి యే
పారినకమ్మవంశపు టపారయశంబు గణింప శక్యమే! 28

ఉ. బోరుకలంగఁగా రజతముద్రలతోఁగనకంబుఁతోడులా
భారముఁదూఁగినట్టినరపాలశిఖామణి వేంకటాద్రియున్
ధీరుఁడు యార్లగడ్డకులదీపకుఁడై తగునంకినీడు నే
హారికులంబునంబొడమి రాకులగౌరవమెన్నశక్యమే! 29

కం. ఆకమ్మకులములోపలఁ
బ్రాకటయశు లార్యనుతులు ప్రాభవయుతులున్
ధీకలితులు ధీరులు హే
వాకసమున్నతులు మన్నె వంశము వారల్. 30

సీ. ధైర్యసమృద్ధిలోఁదపనీయభూధర
మహిమగల్గినవారు మన్నెవారు

గాంభీర్యగుణములో నంభస్సమితికంటె
మిన్నలై తగువారు మన్నెవారు
దానసంపత్తిలో ధారాధరము వెన్నుఁ
దన్నఁగల్గినవారు మన్నెవారు
విక్రమస్ఫూర్తిలో విబుధసేనానికి
వన్నె దెచ్చెడివారు మన్నెవారు
గీ. సహజసౌజన్యవాత్సల్యశాంతధర్మ
సత్యశౌచవైరాగ్యవిస్తారభార
భూరిభాస్వత్సుగుణసంచయారభటస
మున్నతి విలసిల్లెడువారు మన్నెవారు. 31
ఉ. మన్నెముగొన్నవారగుట మన్నెమువారయిపోల్చిరే మొ సం
పన్నగృహస్థసంతతికి మన్ననమీఱఁగ నిచ్చియుండుటన్
మన్నెములెన్నొ, యెన్నఁదగుమన్నెమువారయిపోల్చిరే మొ యే
మన్న నితాంతసార్థకసమాఖ్యము మన్నెమువంశమెన్నఁగన్. 32
ఉ. ఆలలితాన్వవాయమున హారిగుణాకరుఁ డచ్ఛకీర్తి స
చ్చీలనిధానుఁ డున్నతుఁడు శ్రీకొడమంచిలి 'మున్న' బై ధరా
పాలునిభంగివర్తిలి యపారయశోవిసరంబుగూర్చుచున్
వేలకువేల్గడించె నల వేంకటరాయఁడు వంశకర్తయై. 33
శా. బ్రాహ్మణ్యామరభక్తితత్పరుఁడు శుంభద్ధైర్యధీశాలి సు
బ్రహ్మణ్యాలయసుప్రతిష్ఠమహామఃకా బ్రారంభమున్ జేయుచున్
జిహ్మత్వాపగమాచ్ఛధీకలన వాసింబూర్తిగావించి త
ద్బ్రహ్మానందపదంబుఁ జూఱగొనె నాతం డెంతపుణ్యాత్ముఁడో. 34
క. చినరామకృష్ణమాఖ్యుం
డనఘాత్మకుఁడతనితమ్ముఁ డంచితరీతిన్
'మునసబుపని' గైకొని య
త్యనుపమవిఖ్యాతికాంతు లాశల నించెన్. 35

కం. "కొండమంచిలి మునసబు మఱి
కొండమంచిలి మంచినీరు కొండయే" యను నా
నుడికిఁ జినరామకృష్ణమ
కములక్ష్యంబై సుఖైకకలితుండయ్యెన్. 36

ఉ. తాలిమిరత్నగర్భ బహుధర్మపథంబున భీమపుత్రి ను
ద్వేలశుచిత్వసంపదను భీషణవహ్ని సతీత్వమం దుమా
నీలసరోజనేత్రను గణింపని శ్రీమహాలక్ష్మినిన్ గుణా
వాలను బెండ్లియాడె హితబంధుఁడు వేంకటరాయఁడర్మిలిన్. 37

ఉ. వారలకెంత నాత్మకులవర్ధనుఁ డార్యనుతుండు వార్ధిగం
భీరుఁడు నద్రిధీరుఁడు విభిన్నవిపక్షచయుండు భూమిబృం
దారకబృందతత్పరుఁ డుదారమనస్కుఁడు బాపినీడు వి
స్ఫారయశుండు వాసిగని వర్ధిలె నెంతయు ధర్మవర్తియై. 38

ఉ అన్నరపుంగవుండు సుగుణాలయ సాధుచరిత్రి నాశ్రితా
పన్నజనాశ్రియన్ బరమపావనవంశసముద్భవన్ భవా
భ్యున్నతికారిణిన్ బహుళపూతచరిత్రను బాపనమ్మ న
త్యున్నతవైభవంపుద్యుతు లొప్పఁగఁ బెండిలియాడెఁ బేరిమిన్. 39

కం. ఆదంపతులకు ముదమా
పాదించుచు నుద్భవించె నాత్మజుఁడు లస
త్ప్రాదేశనపరుఁ డాది
త్యాదికపూజానిరతుఁడు హరిగుణుండై. 40

ఉ. వంకరలేనివర్తనముఁ బావనశీలముఁ గల్గి విచ్చలున్
బంకరుహాయతాక్ష పదపద్మరతాత్ముఁడైన వాసికిన్
వేంకటరాయఁడంచును వివేకులు సార్థకనామముంచి రే
జంకుఁగళంకు లేని సువిశాలమనస్కుఁ డతండు బ్రాఁతిగన్. 41

కం. దైనందినవృద్ధిగనుచు
నానందంబును బితలకు నానందనుఁడ

న్యాసంబుగ నాదవించుచు
ధీశలయుండగుచుఁ బొలిచెఁ దిన్ననిచరితన్. 42

ఉ. అంటఁగరాని వేల్పునకు నంకిలిగూర్చి శుచిత్వమందు న
ప్పంటవలంతికిన్ క్షమను బాటిదనర్చు సరోజనేత్రి నె
క్కంటికులాబ్ధిచంద్రుఁడయి కాంచెను వీరన ముద్దుపట్టినిన్
వెంటన చెట్టఁబట్టె నలవేంకటరాయఁడు కూర్మి పెంపునన్. 43

ఉ. ఇమ్ముగ నింటిపెత్తనము నెల్లఘటించుచు భర్తకున్ సహా
యమ్మొనరించి సౌఖ్యనిచయమ్మునకిమ్మగు రీతి సల్పి లో
పమ్మొరవంత యేని కనుపట్టనిభంగిఁ జెలంగుచుండి నా
గమ్మ సతమ్ము ధర్మనివహమ్ముల భక్తి నిసల్పు నిచ్చలున్. 44

ఉ. ఆలలితాత్మకుండు సుగుణాలయుఁ డంచితదైవభక్తి కా
వాలము స్వాపతేయము నపారవిధంబున వెచ్చఁ బెట్టి వి
ష్ణ్వాలయరాజమొండును శివాలయరాజమొకండె కాక దు
ర్గాలయమొండుగూడ బళిరా! యన నిర్మితిఁ జేసె నర్మిలిన్. 45

చ. విమలతరప్రవర్తన వివేకవిచారసమున్నతిన్ ద్రివి
క్రమపదపంకజద్వయ నిరంతరమగ్నహృదంతరాళయై
యుమకెనయై సతీత్వమున నొప్పెసలారుచు నాగమాంబ స్త్రీ
సముదయమందు మిన్నయయి సత్కృతులన్ బచరించు నెంతయున్

ఉ. ఆయతకీర్తులై యెసఁగు నామిథునంబునకంత సత్యనా
రాయణమూర్తి మన్నెసుకులాంబుధిచంద్రముఁ డుద్భవించె ధీ
శ్రీయుతుఁ డచ్ఛమానసుఁడు శీలనిధానుఁడు స్నేహపాత్రుఁ డు
ద్గేయగుణుండు ధైర్యసముదీర్ణుఁడు సంతతకీర్తికాముఁడున్. 47

ఉ. ఆకమనీయభక్తిపరుఁ డార్యజనవ్రజసన్నుతుండు సు
శ్లోకుఁడు మాననీయుఁడు విశుద్ధచరిత్రుఁడు ధీయుతుండు దూ

రీకృతఘోరకిల్బిషుఁడు శ్రీగుణరమ్యుఁడు ధైర్యశాలియున్
బ్రాకటమన్నవంశఘనవార్ధిసుధాంశుఁడు సత్యమూర్తి తాఁ. 48

కం. నెక్కొంటివంశమునఁ బెం
పెక్కిన పేరయ్యసుత నహీనచరిత స
మ్యక్కృతిఁ బెండిలియాడెను
జొక్కపుఁజెలి గంగమాంబ సుగుణకదంబన్. 49

సీ. గంగాధునికి సాటి కావచ్చు నందుమా!
పంకసంకలితయై పరఁగు గంగ
సర్వమంగళతోడ సామ్యంబుఁ దెత్తుమా!
సగముచేసి మగని నెగడు నగజ
ఇందిరారమణితో నెనవచ్చునందుమా!
పతివక్షమును ద్రొక్కి వరలు లక్ష్మి
భాషావధూటితోఁ బ్రతిగా దెయందుమా!
నలునోళ్ళలోఁబడి మెలఁగు వాణి

గీ. సర్వభామినీస్తోత్రభాజనమయుగుచు
భర్తృసౌఖ్యప్రదాత్రియై స్వచ్ఛయైన
గంగమాంబకు గంగాదికమలముఖుల
సాటి చెప్పంగవచ్చునే జగతియందు. 50

ఉ. అల్లలనాశిరోమణి పదాబ్జము మెట్టినతోడుతోన న
త్తిల్లు నెలంగె భాగ్యములకెల్ల సముల్లసితంపుటిల్లునై
చెల్లరె! పద్మమున్ విడిచి చేరినలక్ష్మియె కాకయున్న సం
పల్లత లల్లిబిల్లిగను బ్రాఁకఁగ నేల తదాలయంబునన్. 51

చ. అమలచరిత్రయొప్పెసఁగ నాత్మవచ స్తనుకర్మదోషసం
క్రమణములేక సంతతము గాఢతరంబగుభక్తిమీఱ న
య్యమరులనున్ ధరామరచయంబును గొల్చెడి గంగమాంబకుఁ
శమదమసత్యశౌచగుణసంతతి పెట్టనిసొమ్ములిమ్ముగన్. 52

గీ. గంగమాగర్భశుక్తి ముక్తాఫలంబ
యగుచు వేంకటనారాయణాహ్వయుండు
ఆత్మవంశవర్ధనుఁడౌచు నవతరించె
నిజపురికి 'మున్సబయి' యొప్పు నిర్మలుండు. 53

ఉ. పట్టినకార్యమేదయినఁ బారముఁజూడక వీడఁబోఁడు చే
పట్టినయాశ్రితాళి నెడఁబాయఁడు ధైర్యమునందు హేమపుం
గట్టగు బోళ్ళరాఘవులుగాదిలిపుత్రిక యౌచు వానికిన్
గట్టులఁజేనిపట్టె కెనకాఁదగు సాధ్వి వీరభద్రమున్. 54

కం. వేంకటనారాయణుఁడు వి
శంకటముగఁ బెండ్లియాడె శశ్వత్ప్రీతిన్
పొంకపుగుణనివహమున న
లంకృతుఁడయి వృద్ధిమెయిఁ జెలంగెడుఁగాతన్. 55

ఆ వీరభద్రవేంకటనారాయణాఖ్య పుణ్యదంపతులకు వేంకట సూర్యసత్యప్రసాదు, శ్రీకృష్ణయను నిరువురు ముద్దుకుమారులును, బాలాత్రిపురసుందరియను గాదిలికుమార్తెయుం గలిగి, దినదినమభి వృద్ధిఁగాంచుచుండి రింకను నేతద్మన్నె వంశంబు దోసతోఁటవలెఁ బెంపువహించి భగవత్కరుణా కటాక్షవీక్షణంబునఁ దామరతంపరై యఖండధనధాన్య యశోధైర్యమనీషా సంపదలకిక్కయై యాచంద్రా ర్కము వర్ధిల్లుఁగాత! మెండియు మత్కృతీశ్వరుండగు సత్యనారాయణ మూర్తి జమీందారు గుణగణంబుల వక్కాణింతు. 56

సీ. గోమియై యపవర్గకామియై ధనధాన్య
భూమియై నిజపురస్వామియగుచు
శాంతుఁడై పరివిమలస్వాంతుఁడై సద్యశో
వంతుఁడై భూరిధీమంతుఁడగుచు
శీలియై సదయాశాలియై నిజవంశ
మాళియై సత్కలాపాళియగుచు

పీఠుఁడై భూమిభృద్ధీరుఁడై శౌర్యసం
చారుఁడై సత్సమాచారుఁ డగుచు

గీ. అఖిలవిశ్వంభరావలయాంతరాళ
సంస్థితాప్తబాంధవమిత్రసత్ప్రపంచ
తామరసబృందలోకబాంధవుఁడు వెలయు
ప్రథితసుగుణుఁడు సత్యనారాయణుండు. 57

గీ. పదియురెండు వేలకుఁబైని వ్యయమొనర్చి
తల్లి నాగమ్మపేర సత్రమును గట్టె
సరసపురమున సౌఖ్యమందిరము గాఁగ
నతఁడు మాతృభక్తి విశేష మతిశయింప. 58

ఉ. చేతికిజిడ్డువాయక ప్రసిద్ధిఁగాంచిన గడ్డపెర్గు సం
జాతఘుమంఘుమల్ గొలుపు సారఘృతంబును చిక్కనైనపా
లాతతసర్వసస్యము లనంతముగా ఫలియించుభూములున్
బ్రాఁతిగఁగల్గి మించు కొడనుంచిలి సంచితభాగ్యమోయనఁ. 59

ఉ. పాయకనీతి నప్పురముఁ బాయక లక్షలు లక్షలెన్నియో
న్యాయపథానుయాయియయి యార్జనముం బొనరించె సత్యనా
రాయణమూర్తి మన్ననుశీలాంబుధిపూర్ణసుధాకరుండు రా
మాయణకావ్యభర్త తగదా! నుతిసేయఁగ వానియున్నతిన్. 60

సీ. ఇరువదేండ్లకుమించి వరుస 'జిల్లాబోర్డు'
సభ్యత్వము గడించి సొరుగాంచె
ఇనుపదూలములొప్ప ననుపమానంబైన
సత్రంబు గట్టించి జానుమీఱె
ఆచంటపాఠశాలాభివృద్ధికిఁ బొంచెఁ
బంచశతంబు లర్పించి మించె
పైలరున్నతపాఠశాలామతల్లికి
నైదువందలొసంగి హారువు గాంచె

గీ. అపుడపుడు దీనవిద్యార్థు లాశ్రయింప
నక్కఱల ధర్మబుద్ధి లేదనక తీర్చె
సత్యవాఙ్నిరూఢుండు ప్రశస్తయశుఁడు
ప్రథితచరితుండు సత్యనారాయణుండు. 61

మ. వెడగౌం గార్యములందుఁ బైసయును న్వెచ్చింపఁగాఁ బోవఁడె
య్యెడలన్ మానఁడు ముఖ్యకార్యములయం దొంతేని వెచ్చింపఁగా
నడుసుం దొర్క్కఁడు కాలుగడ్డఁ డమలవ్యాపారమేకాని యొం
డెడకే 'జోలికి శొంఠికిం' జనఁ డికేరీసాటి యవ్యాజికిన్. 62

శా. భూముల్పుట్రిలుపండి పెక్కగతులన్ బొల్పారఁగా షడ్రసీ
సామగ్రిరుచిమత్పదార్థవితతుల్ సంధిల్ల నెల్లప్పుడున్
బ్రేమాద్ధత్యము నాదరంబు మిగులన్ రేయైన భక్తిం ద్రుత త
ద్ధామంబందు సమస్తబాంధవసుహృత్సందోహ మాకంఠమున్. 63

గీ. స్నేహితుల కాపదే దేని చెలఁగెనేని
దానిఁ దొలఁగించుదాఁక నిద్రయును బోవఁ
డాయతగుణుండు సత్యనారాయణుండు
సద్వితులపాలి కల్పవృక్షంబుగాదె! 64

ఉ. అమ్మహనీయవంశజుఁ డహంకృతిదూరుఁడు కీర్తికాముఁడై
గుమ్మముపాడునాఁబరఁగు కొండొకప్రోలును పైడిపట్టుగాఁ
మమ్మ నొకండునుం గొనుచు మంతునకెక్క 'జమీనుదారుఁడై'
యిమ్మగు గ్రామసంచయము లింకను నార్జనచేయుఁగావుతన్. 65

### షష్ఠ్యంతములు

కం. ఏతాదృశగుణమణి వి
ఖ్యాతచరిత్రోజ్జ్వలునకు నలమునిగోత్రో
పేక్షితపరిపూతకులసం
జాతున కాశ్రితసరోజజలజాప్తునకున్. 66

కం. రజతాచలనిభయశునకు
విజితాంతశ్శత్రునకుఁ బవిత్రాత్మునకున్
భజమానదానగుణునకు
ద్విజహల్లకచక్రవాళ విమలేందునకున్. 67

కం. మేరుధరాధరధీరున
కారూఢ యశోంచితునకు నల నాగాంబా
సారతరగర్భపారా
వారకుముదబాంధవునకు వర్ధిష్ణునకున్. 68

కం. దీనజనావనునకు వి
త్యానందస్థితిగతునకు నతి శాంతునకున్
మానితగుణయుక్తునకు స
దా నయచరితునకు నధికధర్మపరునకున్. 69

కం. గుణమణికి సత్యనారా
యణమూర్తికి ధీనిధికి సముంచితకృతికృ
చ్ఛణమతికి సమార్జితహిత
గణలిప్సాతతికి సుకవికంజతరణికిన్. 70

అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనిన యాంధ్ర దూర్వాస రామాయణంబునకుఁ గథావిధానం బెట్టిదనిన:— 71

# హంసలకథ

శా. చంద్రప్రస్తర నిర్మితోన్నత మహాసౌధాగ్ర భాగంబునన్
జంద్రాస్యల్ జనకాత్మజన్ రఘుకులస్వామిభర్త కేలూనుచున్
సాంద్రజ్యోత్స్నఁ జరించుచోఁ బుడమిపైఁ జంచద్గతిన్ రాజహం
సేంద్రున్ సుందరవిగ్రహుల్ మహిజ దా నీక్షించె దాదవ్వులన్.

గీ. అప్పు డపరంజిచాయల యంచగములు
గుములుగట్టుచు నరుదేర గోచరించె
మింటి నదిఁ బొల్చు పొందమ్మి జంటవోలె
నందు నొకహంసమిథున మయ్యవసిసుతకు. 73

ఉ. కాంచనపక్షజాలమును గాంచనచంచువు గాంచనప్రభో
దంచితగాత్ర మీదృశపు టంచలఁ గాంచఁగ వచ్చునే జగ
త్సంచయమందు నెం దిపుడు చయ్యన నయ్యవి యేగ నిద్దురన్
గాంచ నిఁకట్టి యంచలను గాంచనిజన్మ మధన్యమే సుమీ. 74

చ. అనవిని రాముఁ డవ్వచన, మప్పుడ పిల్చి యమాత్యవర్యు ని
ట్లను సచివాగ్రగణ్య! భవమంతయుఁ గర్మపరంపరాస్పదం
బును బరమాద్భుతంబగుటఁ బుత్తడిగర్భపు వేల్పుసృష్టిలోఁ
గననగుఁ జిత్రచిత్రములు కర్మ మనంత మగమ్య మాద్యమున్.

మ. నరు లజ్ఞానవశంవదాత్ములయి నానా సౌఖ్యవిభ్రాంతి భా
స్వరసౌధంబులు మృష్టభోజనములున్ శయ్యాదిభోగంబులుం
బరమంచున్ గ్రహియింతు రీ పూర్వకృతకర్మవ్యాకృతింగల్గు ధీ
వర! తత్కర్మఫలాఫలంబులను దోవ్రవన్ రాదు దేవాళికిన్. 76

ఉ. అంచితవారిజాకరము నచ్ఛపయఃపరిపూరితమ్ముఁ దవ్వి
వ్వించి, సువర్ణపద్మములు వింతరకంబులకై రవంబు లం
దుంచి, సరస్తటమ్ముల ఖగోత్తమభోజనయోగ్యరీతి నా
టించి, మహీమహమ్ముల ఘటింపు మశేషవిహంగసౌఖ్యమున్. 77

గీ. దేశదేశమ్ములందుండి దివ్యపక్షి
గణములే తెంచి యాతటాకమ్మునందు
హాయి నొదవించుపట్టున హావుసుమీయు
స్వర్ణహంసలు తన్మధ్య వరలుచుండు. 78

గీ. అపుడు, సీతామహాసాధ్వి, హంసలఁగని
కన్నదోయికి సార్థక్యగరిమ గూర్చు
కొనుచనిన, నన్నియుఁ ద్రుటిలోఁగూడె 'రాజు
దలఁచినఁ గొదవయగునె దెబ్బలకు నెందు' 79

మ. అతిలోకం బతిమాత్ర మద్భుతకరం బాభూరికాసారమం
దిత రానేకశకుంతశాబకచయం బేతెంచి యావాససం
గతినుండన్ మరికొంతకాలమునకున్ గాంగేయకాంతిచ్ఛటా
పతగద్వంద్వము వచ్చి నిల్చెనచటన్ భామాప్రమోదంబుగన్.

ఉ. బహువిధమైన క్షీరములుఁ బక్వఫలాదులు సేకరించి త
న్మహిసుత రాజహంసలకు మచ్చిక హెచ్చనొసంగుచున్ ముహు
ర్ముహురుపలబ్ధమోదరసపూరనిమగ్నమనోంబుజాతయై
యహరహ మచ్చటన్ మెలఁగె నాసుభగత్వదిదృక్షపెంపునన్. 81

చ. పగడపుఁగాంతిసంపదలభాసిలు నాసికయుం బదంబులున్
నిగనిగలాడు మౌక్తికపునిగ్గులకన్నులు మంజులధ్వనుల్
నెగడఁగ జోడుఁబాయని యనింద్యఖగద్వయిఁబూజలం బొన
ర్పఁగఁదొడఁగెన్ హృదీశుఁడెడబాయక తన్నలరింపనోయనన్.

ఉ. ఈడునుజోడు లేని సరసీంద్రము తీరమునన్ జరించు పూఁ
బోఁడి సుమప్రకాండములు భూస్థలిపైఁ బడియుండి సుంతయున్
వాడక సౌరువీడక సువాసనలోడకయుంటఁజూచి తూఁ
గాడఁగ వింత సేవకుల నక్కతమేమని పృచ్ఛసేసినన్. 83

చ. ఇనకులరత్నదీపకుని యింతికి జంకుచుఁ బుష్పలావికల్
జనకజ! ప్రత్యహం బిచటిస్వర్ణశకుంతయుగంబు దీనిలో
మునిఁగి సుపూజచేసి మునిపోలిక ధ్యానమొనర్చుచున్నదం
చన విని తన్మనోజ్ఞవచనామృతరీతికి మోహితాత్మయై. 84

కం. ఆహంసల వృత్తాంతం
బాహంసగమన తెలియుట కాస్థాసహితం
బా హృదయముతో నుండఁగ
నాహా! యాహంసమిథున మగపడి కలలోన్. 85

కం. సీతా! ప్రాత ర్వేళల
నేతద్వృత్తాంతమెల్ల నెఱిఁగింతుము నీ
చేతఃప్రీతిగ వినయో
పేతంబుగ ననుచుఁబలుక వేఁగుంబోయెన్. 86

కం. తెలవారు వేళ సద్యః
ఫలితంబులుగావె కలలు భూమి వినన్ నె
చ్చెలులుగొలువ నీరీతిగఁ
బలుఁగులు నిజచరిత మానుపూర్విగఁజెప్పెన్. 87

చ. కలదలమందరాద్రి మణికాననసీమలఁ బొల్చునద్ది త
త్కలశపయోధిఁద్రచ్చఁగ సుధన్ బహుసిక్తములైన పుణ్యభూ
ములఁగిసలమ్ములున్ గుసుమముల్ ఫలజాలము మృత్యుహారకో
జ్జ్వలితములై వలీపలితభారము మాపఁగఁజాలు లీలగన్. 88

చ. అతులితరత్నసంతతులకాస్పదమై హిమశైలకూటకాం
తితతుల కాకరంబయి యుదీర్ణము రమ్యమునై వినీలలో
హితయుతమై ప్రభాఢ్యమయి యేచెడుమంథనగంబుకన్న ను
న్నతమహినున్న శ్వేతవసుధాధరమందు శివుండు పొల్చెడున్.

గీ. దేవకార్యార్థ మా శివదేవవిభుఁడు
తొయ్యలినివీడి యేతెంచె దూరమునకు
శివునిఁగానక వ్యాకులచిత్తయగుచు
విరహభరమున హిమశైలవీథులందు. 90

కం. శంభుక్రీడాస్థలముల
సంభోరుహ నేత్రి వెదకి యనవరతము వి
స్రంభంబునఁ దిరుగ దొడఁగె
రంభాదులఁ బోలఁజాలు రమణులతోడన్. 91

కం. అంతఁగుహూకుహూలు వినదా
క్రాంతము విరహిజన పేటికాకుంతం బ
శ్రాంతోన్మిషద్వివిధసుమ
సంతానము కాంత మవ్వసంతము దోఁచెన్. 92

ఉ. ఆయెడ భర్తృచింతనపరాయణ నాపత్రిమధాళి పాదప
చ్ఛాయల నిల్చి కొల్చునెడఁ జామరహస్తసమేతఁజంద్రరే
ఖాయువతిం గనుంగొని వికావికనవ్వెనొకండు దానిఁ గా
త్యాయని చూచి కోపవివశాత్మకయై శపియింపఁబూనుచోన్. 93

గీ. నవ్వుకొనుచున్న వారల నటనఁజూచి
తుండి భృంగాఖ్యులనియెడి ధూర్తమతులు
పక్కననునవ్వి రదియేమిపాపఫలమొ
నాల్గువిధముల నష్టంబు నవ్వుగాదె? 94

చ. సమయముకానియిట్టితఱి శంభుఁడు నన్ విడనాడుటన్ వియో
గముభరియింపలేక మదిగానక యాపదనున్న నాకు నొ
చ్చెముఘటియింప నవ్వుదురె చెచ్చెర నీవును జంద్రరేఖయున్
క్రమముగభర్తయున్సతియుఁగాఁజరియింపుడు భూతలమ్మునన్.

పంచచామరము

దురాత్ములార! తుండిభృంగధూర్తులార! మీరిలన్
ధరామరుల్ తదంతమందు దైత్యులై పిశాచులై
కలంగలించు చోరు లంతఁ గుక్కలై పులుంగులై
చరింపుడంచుఁ దీవ్రభంగి శాపమిచ్చె వారికిన్. 96

సీ. శాపమీరీతి నొసఁగిన శంభురాణి
కడకు ధూర్జటి ప్రమథుండు గదలి వచ్చి
పిన్నతప్పున కొప్పునే పెద్దశిక్ష
యనుచుఁ బల్కినఁ బార్వతి యాగ్రహించి. 97

కం. దురహంకారంబున ని
ట్లురవడిఁ బ్రశ్నింప మమ్ము నొప్పునె శఠుఁడా!
ధరణిన్ నరజన్మంబున
నఱుమనెఁగాముకుల కెఱుకయన్నది కలదే? 98

ఉ. దేవి! దయాస్వరూపిణి! పదింబదిగా శపియింపనౌనె నే
నేవిధిఁ జంద్రరేఖఁ గనకీ కొనప్రాణము నిల్పుకొందు నీ
పావనసత్కృపాపటిమ భాసిల శాపము గ్రమ్మరింపు మం
చావిధురేఖతల్లి శరణార్థ సతీచరణాబ్జ మంటెఁగన్. 99

కం. శాపంబు గ్రమ్మరింపఁగ
నోప నవజ్ఞ సలుపంగనోర్తునె కానీ
నీపడఁతి శాపమోచన
మేపారును వేగమంచు నీశ్వరి పలికెన్. 100

కం. అదనుంగని ప్రమథు లుమా
పదపద్మములందుఁ వ్రాలి భర్గునిరాణీ!
పదపడి శాపవిమోక్షణ
ము దయన్ దయసేయుమనుచు మ్రొక్కుఘటింపన్. 101

ఉ. జ్ఞానమునూనుచున్ గ్రమముగా ఖగజన్మమునందు రామభూ
జానిముఖారవిందమును సంభ్రమమొప్పఁగఁ జూచునాఁడ య
జ్ఞానము దూలఁ గిల్బిషగణమ్ము యథాయథలౌను నాఁడె నన్
గానఁగవత్తురంచు దయకల్మిని గౌరి యనుగ్రహించినన్. 102

శా. రాజీవాక్షుని రామచంద్రుని దయారాశిన్ మహోదారునిన్
భ్రాజిష్ణున్ దురితౌఘతూలవిలసద్వైశ్వానరున్ వీరు స
త్తేజున్ సత్యపరాక్రమున్ గని కుబుద్ధిన్ దుంచినా విష్ణు మా
రాజీవాక్షిని గౌరిఁ జేరుదుము పారిబ్ధంబుఁ జక్కాడుచున్. 103

చ. అదవదలేక మందరమునందలి పూవులఁగోసి తెచ్చి స
మ్మదమున రామచందురినకుఁ బూజయొనర్తు ము జానకీసతీ!
తదమలపుష్పసంతతులు ధారుణిపై బడికూడ వాడ వీ
విది కనులారఁగాంచి శివు డింతయు సత్యమటంచుఁ బల్కుచున్.

కం. దొడ్డపులుఁగుగములు పడీ
నోడ్డీనాదివివిధగతులొప్పఁగఁ జదలం
దడ్డముగఁబఱచి పూర్వపు
జడ్డుఁదనము వీడి గిరిజ సరసంజేరెన్. 105

—:0:—

శ్రీ ర స్తు.

# ఆంధ్ర

# దూర్వాస రామాయణము

## చంపకా పరిణయము

అంతట నొక్కనాఁడు వినయాన్వితు లాప్తు లమాత్యరాజి ధీ
మంతులు దండనాయకులు మానులుఁగొల్వఁగ రత్నమందిరా
భ్యంతరభర్మపీఠమున భానుకులాంబుధిపూర్ణచంద్రుఁ డ
త్యంతవిశాలశాలయను నభ్రపథంబున వెల్గుచుండఁగన్. 1

ఉ. ద్వారమునందు భూసురకులాగ్రణియొక్కరుఁ డుల్లసత్త్రి యీ
పారగుఁ డార్యసన్నుతుఁడు వచ్చి నిలంబడి స్వామిదర్శనం
బారయుచున్నవాఁడు సెలవైనయెడన్ గొనివత్తునంచు దౌ
వారికుఁ డారఘూత్తమునిఁబల్కెనయమ్మునఁ గేలుమోడ్చుచున్.

కం. కొనిరమ్మనియాజ్ఞాపిం
చిన దౌవారికుఁడును జని చెప్ప ద్విజుఁడు రా
మునికడకేతెంచుచు దీ
వెన లీరీతి నొసఁగుచుఁ బ్రవేశించె సభన్. 3

గీ. ఆయురారోగ్యమస్తు విఖ్యాతిరస్తు!
బుద్ధిధనధాన్యవాహనసిద్ధిరస్తు!
మిత్రపుత్రపౌత్రాది సమృద్ధిరస్తు!
ప్రతిభటగణక్షయోస్తు! తే రామచంద్ర! 4

మ. వినయౌదార్యదయానురాగ శమగాంభీర్యాది నానాగుణుం
డనఘుం డారఘురామచంద్రుఁడనె నయ్యా! భూసురాగ్రేసరా!
మనమూఁగాడుచునున్న దూయలవలెం బావంగదే సందియం
బు నమస్కారములేక దీవెనలిటుల్ పొందింప నేధర్మమో. 5

చ. అనవిని భూసురప్రవరుఁ డాతనితో ధరణీశ్వరా! ప్రియో
జనముఁ బురస్కరించుకొని సత్సభనుండిన నిన్ను జేరితిన్
పనిగలయట్టివా రెదుటివారి నమస్కృతిలేకముందె దీ
వెనలిడు టార్యసమ్మతము విస్తృతధర్మము నిర్ణయంబగున్. 6

కం. కార్యార్థినిఁ గావున నీ
యార్యజనులసంప్రదాయ మరయుచు నో ధీ
ధుర్యా! యాశీర్వాదపుఁ
గార్యమొనర్చితిని ముందుగా ననిపలుకన్. 7

ఉ. విప్రునిధర్మసంగతికి వేడుక యుప్పతిలంగ రామధా
త్రీప్రభుఁ డోద్విజోత్తమ! త్వదీయమనోరథ మేదియైననున్
క్షిప్రమ చెప్పుమా! యసురచింత, మృగమ్ములభీతి, యంతరా
యప్రకరమ్మ యజ్ఞములయందు ఘటిల్లక సౌఖ్యమందువే? 8

కం. వినయము పెనఁగొనఁబలికిన
యినకులజున కా ద్విజేంద్రుఁ డీదృశభంగిన్
దన పెనుదుర్దశయంతయు
వినిపించెను సభ్యులెల్ల విస్మయమందన్. 9

గీ. అధికధర్మస్వరూపుఁడవైన నీవు
విన్నవింతు నాకథను పృథ్వీతలేంద్ర!
ధర్మసంకటస్థితియందుఁ దగులుకొంటి
నయవిశారద! ధర్మనిర్ణయ మొనర్పు. 10

చ. విలసితచాతురీమహిమ వెల్లడిసేయఁగ నెంచి బ్రహ్మ తాఁ
దొలితొలిసృష్టిచేసిన వధూమణియో యన ధిక్కృతేందిరా
జలరుహనేత్రియో, రతియొ, శక్రునిదేవియొ, నాఁగనొప్పుచున్
గలిగెను జంపకాఖ్యయగు కన్నెయొకర్తుక నాకు భూవరా! 11

కం. ప్రతిపచ్చంద్రునిరీతి ను
దతి మన్మందిరమునందు దైనందినవ
ర్ధితగాత్రియగుచు యౌవన
వతియై పరిణయపుటీడు వచ్చినదయ్యెన్. 12

చ. పరిణయముం బొనర్పఁ బ్రతిబద్ధమనంబున దేశదేశముల్
చిరమొకపిచ్చివానివలెఁ జింత హృదంతరసీమ గాడఁగాఁ
దిరిగితి యోగ్యుఁడౌ వరునిఁ దేరఁగఁ దండ్రికిఁ గట్టు! కన్యకా
పరిణయవృత్తికంటె నతిభారపుఁగార్యము వేఱయున్నదే. 13

కం. తిరుగం దిరుగఁగ నొకచో
స్మరసన్నిభుల, యువకుల, విమలచిత్తుల, భా
స్వరసకలశాస్త్రవేత్తల,
ధరామరకుమారకుల, సధర్ముల, ముగురన్. 14

ఉ. కంటిని దైవయోగమునఁ గంటికి నింపయి పొల్చువారి ము
క్కంటినిఁ, దమ్మికంటిని, జగమ్ములఁ జేసెడు దచ్చికంటినిన్
గెంటెడుదంటలన్, వటుల, గీష్పతితుల్యుల, వారలంత నా
వెంటన యంటివచ్చి సుతఁ బెండిలియాడ సునిశ్చితాత్ములై. 15

శా. ప్రారబ్ధోద్యమవృత్తులై ముగురువిప్రశ్రేష్ఠులుంగూడ 'నీ
నారీరత్నము నాదుభార్య యిదియే నాభార్య, నాభార్య, యీ
నీరేజాక్షి' యటంచు మోహమను మున్నీటన్ నిమగ్నాత్ములై
వారన్యోన్యము వాదులాడుకొని యాపై నాపయిన్ గ్రుద్ధులై. 16

కం. మాకిమ్మని, మాకిమ్మని,
మాకిమ్మని, ముప్పురును సమర్థంబున నా
వాకిలి గావలిగాయుచుఁ
జీకాకు ఘటించుచుండ్రి సీతారామా! 17

కం. సుతయొక్కతె యానేకద
పతులెట్టులు ముప్పురగుచుఁ బరఁగుదు రౌరా
గతియేమి యెవరికిత్తును
మతిమతిలో లేదు దైవమా యనునంతన్. 18

కం. అంత హఠాత్సంభవదు
ర్దాంతజ్వరరోగపీడితయగుచు సుత దా
వింతగ నకాలమృత్యువు
ఖాంతరమందుఁబడి మడిసె నందఱువగవన్. 19

ఉ. అప్పుడుముప్పురున్ వటులు హాసతి! హాసతి! హాసతీ! యటం
చుప్పరమంట నేడ్చి మనసొప్పక యెంతయు మోహితాత్ములై
చెప్పెడిదేమి యాశవముఁజేర్చి దహించిరి వల్లకాటిలోఁ
దప్పలుదోఁచునే కుసుమధన్వుని యేటులఁబడ్డవారికిన్. 20

ఉ. ముప్పురిలోన నొక్కవటుపుంగవుఁ డా భయదశ్మశానమం
దవ్విరిఁబోఁడి బూడిద సమంచితశయ్యగ సంతరించి దా
దప్పల బిచ్చమెత్తుకొని దానిభుజించుచు వల్లకాట నా
మవ్వపుశయ్యఁబండుకొను మానినినామమునే జపించుచున్. 21

చ. మరియొకబ్రహ్మచారి యతిమాత్రము రోదనముంబొనర్చి యు
వ్విరివిలుకానిచేతఁ బరిపీడితుఁడై సతియందుఁ బ్రేమచే
మురియుచు మూటగట్టుకొని ముద్దియయస్థిక లెల్లఁగాశిలోఁ
బరమపవిత్రగంగనిడి పాయఁగఁద్రోచెను దుర్దినంబులన్. 22

కం. కానీ ! మానసమెప్పుడు
మాసిని రూపమున బద్ధ్యమానంబగుటన్
మానసమునిల్వ లేక శ్మ
శానముఁ జేరుకొనెఁ గొంత సంతృప్తికిఁగాన్. 23

ఉ. ఇంకొక బ్రహ్మచారియుఁ బదింతలు వావిరి మొట్టవెట్టి యా
పంకజపత్రనేత్రకయి స్వాంత మనంతముగాఁ జలింప న
ల్వంకల దేశదేశముల వంకకుఁ బోవఁగఁ జిత్తశాంతికై
యంకిలిలేక సల్పెను ప్రయాణ పరంపర లన్యభూములన్. 24

కం. పల్లిపట్టణవీథుల
నెల్లం దిరుగాడుచుండి హేరాళముగాఁ
బెల్లాకఁట నొకదినమున
నల్లాడుచు నొక్క ద్విజగృహంబును జేరెన్. 25

కం. సరిగా భోజన వేళకు
నరుదెంచిన యతిథియతఁడె యచ్యుతుఁ డనుచున్
ధరణీసురుఁ డర్చించెను
పరమానందమున నర్ఘ్యపాద్య క్రియలన్. 26

గీ. స్నానసంధ్యాద్యనుష్ఠానసరణిఁ దీర్చి
ధ్యాన మొనరించి సావిత్రి భానుఁగొల్చి
పరమనిష్ఠాగరిష్ఠుఁడై బ్రహ్మచారి
సకలసత్క్రియాకాండ నిస్తంద్రుఁ డయ్యె. 27

ఉ. వడ్డనసేయుచో గృహిణి పావనవర్తన కాళ్ళ కర్భకుం
డడ్డమువచ్చి గొల్లుమనియూర్చుచుఁ బోరును బెట్టుచుండ నీ
బిడ్డడు సడ్డసేయఁ డొకపిన్నయుఁ బెద్దయు వచ్చినప్పుడం
చడ్డని కోపవేగమున నాపె కుమారునిఁద్రోసె నగ్నిలోన్. 28

ఉ. తాలిమిదూలు తజ్జనని దారుణకృత్యముఁజూచి యర్థి "చా
ల్చాలు, కుమారులంగనరె జవ్వను, లల్లరిసేయరే సుతుల్,
వేళకురారె విప్రులిటు వేల్తురె? ముద్దులబిడ్డ నిట్టి యి
ల్లాలినిఁ, గ్రూరురాలిని, నఘావలిపాలినిఁ, గాంచమెచ్చటన్. 29

మ. అనుఁగుంబిడ్డఁడు భస్మమయ్యె నిది దయ్యంబౌర! యీయింట నో
దనమంటన్ బహుపాపమంటు, నణఁగున్ ధర్మప్రకాండంబుఁ, బ్రా
క్తనకర్మంబున వచ్చినాఁడను 'నభోక్తవ్యం నభోక్తవ్య మం''
చును, లేవంగ గృహస్థువానిఁ గనుగొంచున్ భీతచిత్తంబునన్. 30

చ. ఉరుతర భక్తిమోడ్చి కరయుగ్మము 'మన్ననసేయరాదె యా
దరమునఁ దప్పులున్నయెడ ధర్మమె? మీరిటు లేచిపోయి నా
యురుసముఁబాప భోజనపదార్థములెల్లను సిద్ధమైన యి
త్తఱిఁ గ్రుధ కేమి హేతువని తత్పరుఁడై మృదుసూక్తి నిట్లనున్.

ఉ. చిత్రము నాచరిత్ర మతిచిత్రము నాసతి పూతవృత్త మే
నత్రివినిస్పృహాత్మకుఁడ నగ్నినిఁ బడ్డకుమారుకోస మీ
వాత్రమునందఁబోకు మృతినందఁడు వాఁ డిది మాకు విప్ర! స
ర్వత్ర, నిరంతరమ్ముఁ బరిపాటియటంచును బుజ్జగించుచున్. 32

కం. గతజీవులైనవారిని
బ్రతికించెడు మంత్రముగల పరమగ్రంథం
బతిచిత్రము నతి పాత్రం
బతిథివరేణ్యా! మదధీనమైనదిసుమ్మా! 33

ఉ. భస్మమయున్నఁజాలుఁ జుమి పావనపుస్తక మొక్కసారి యా
భస్మముచుట్టుఁ ద్రిప్పునెడ బాలుఁడు గ్రమ్మఱఁబుట్టునంచు వే
విస్మయ ముప్పతిల్లుగతి విప్రునకుం బతి యట్లొనర్పఁగా
సస్మితుఁడౌచు బాలకుఁడు చానపదంబుల కడ్డవాఱఁగన్. 34

చ. స్మరణకు వచ్చి చంపక సుమప్రదరప్రదరప్రదష్టుఁడై
పలుగులు వాఱుచుండ బహుభావపరంపర చిత్తవీథి నా
పరమపవిత్రపుస్తకము పొల్పడు టెట్టులటంచు వర్ణి మే
ల్వెరవున కూహసేయు నవివేకివలెన్ దలయూఁచు నవ్వుచున్.

గీ. అతిథిసత్కారఫలము నాకబ్బునట్లు
తృప్తిదీర నిపుడు భుజియింపుమయ్య
లలితభోజ్యవస్తువులు చల్లారకుండ
ననుచు గృహమేధి వలుక బహ్వాదరమున. 36

చ. కులపతిమాట వర్ణి చెవిఁగూర్పఁగనొల్లడు, పల్కనొల్లఁడున్
దలఁపఁడు, ముట్టఁడన్నమును, దైన్యమునొందుచుఁ జేయిఁబెట్టుచున్
గలఁచినయట్టులై, మది కకావికలౌటయు, నశ్రువుల్ కనుం
గొలుకులజాలువాఱఁ గనుగొంచుఁ గుటుంబి దయార్ద్రచిత్తుఁడై 37

చ. అతిథి మనోరథంబులను సాంతముగా నెఱవేర్చుభాగ్య మే
పతికి లభించు నాపతి భవమ్మ్మ, భవమ్ము్మను, ధన్యమాట నీ
ప్సితము వచింపు మేదయిన శీఘ్రమె తీర్చెదనంచు నాతఁడున్
బ్రతినయొనర్ప నర్థి ముఖపంకజ మింతలునంతలై తగన్. 38

ఉ. ఓదనమారగించి వినయోన్నతి నాతని పూర్వవృత్తముఁ
ఖేదముతో వచించి మరణించిన చంపకనామధేయ సం
పాదనసేయ గ్రంథమొకమారు ద్విజాన్వయవార్ధిచంద్రమా!
కాదనకుండ నిమ్మనుచుఁ గందువమాటల వేడుకోడనే. 39

గీ. ఆడితప్పనివాఁడు, ధైర్యంబువాఁడు
కరుణగలవాఁడు, బిడ్డలఁ గన్నవాఁడు
మానధనుఁడైనవాఁడు, ధీమహిమవాఁడు
అతిథిజనహృద్యమీడేర్చి యలరువాఁడు. 40

కం. ఉరవడిఁబతిదా నొసఁగుచుఁ
బరమాద్భుతపుస్తకమ్ముఁబని వెనుకను భూ
సుర! తెమ్మనిపలికె సహజ
పరోపకారాచరణ విభాస్వరులు ఘనుల్. 41

గీ. మహితనిజకాంత బ్రతికించుమార్గ మబ్బె
నని శ్మశానవాటికి వటుఁడరుగుదెంచి
సలిలమును భస్మరాశిపైఁ జల్లిచల్లి
బూదిచుట్టును దిరిప్పంగఁబొత్తమంత. 42

ఉ. వాడనిమోముతో, సురభివాయని మేలిప్రసూనమాలతో
వీడని కాంచనాభరణ బృందముతో మును పెందు నెవ్వరుం
జూడనిక్రుల్కుతో, జిగియు, సొంపులనింపెడు మేనికాంతితో,
బూడిదనుండి యాభువనమోహిని చంపక యింపునింపుచున్. 43

కం. ఉద్భవమందుచుఁ దోడనె
మద్భవనమున కరుదెంచి మాకత్యాశ్చ
ర్యాద్భుతముగ బంధుజనుల
ముద్భారవహులనుజేసి పొలిచెం బెలుచన్. 44

కం. చనిపోయిన తనయనుగను
జనకుని యానందమనెడు జలధికి రామా!
కనుఁగొనఁబారములే దై
నను మునుపటివంత మరల నన్నుఁగ ముట్టెన్. 45

మ. వటువుల్ ముప్వురువచ్చి క్రచ్చఱ ననుగ బాధించుచున్నార లో
పటుధర్మాత్ముఁడ! యందు నెవ్వనికి నాబాలామణిన్ బెండ్లిసే
యుట ధర్మంబును శాస్త్రసమ్మతమగున్ యోగ్యంబ దేదొను సం
కట సందేహపరిస్థితిం గనిన నన్ గాపాడుమో రాఘవా! 46

ఉ. ఆమహీదేవువాక్యనిచయంబుల కచ్చెరువంది యంత శ్రీ
రాముఁడు, మందహాసముఖరాజితసోముఁడు, బద్ధశాత్రవ
స్తోముఁడు, దా శ్రుతుల్ స్మృతులు చూచి వసిష్ఠపురస్కృతంబుగా
భూమిసురప్రకాండునకుఁ బోలిచి చెప్పెను దీర్పు నేర్పుమై. 47

చ. మతిచెడి పొత్తముం గెలిచి మానినియందలి మోహవృత్తి సం
తతముఁ దపించినాఁడని యతండు ధవుండని పల్కె రాము సు
మ్మతివ పునర్భవమ్మునకు నారయఁ గారణభూతుఁడౌట చే,
నతఁడగుఁ దండ్రి యట్లగుట నర్హుఁడుగాఁడని చెప్ప నేటికిన్. 48

చ. అలయుచు మోహబద్ధుఁడయి యచ్చటనచ్చట లుంఠమానుఁడై
మలఁగినయంతమాత్రమున మానినికిన్ మగఁ డెట్టులౌను స
ద్విలసితధర్మశాస్త్రములు విప్పి వచించెద దేనియస్థికల్
కలుపునో గంగలో నదియ కాఁదగుఁదల్లి యతండు పుత్రుఁడౌ.

చ. ఘనతర భైక్ష్యవృత్తి మెయిఁ గన్నులుగానక దానితోడి దే
తనువని భస్మశాయియయి తత్తఱపాటును లేక యన్యచిం
తనము నెఱుంగఁ డింకొకఁడు దాల్చెఁగ నేఁటికి సందియంబు నీ
తనయకు వాఁడె భర్త యిది తథ్యము ధర్మము దైవయోగమున్.

గీ. పరమధర్మంబు వింటివే బ్రాహ్మణుండ
ధర్మయుక్తము సంపత్ప్రదమ్ము శుభక
రమ్ము కల్యాణ మిద్ది శీఘ్రమొమ్మనప్పు
మనుచు శ్రీరామచంద్రుండు వినుచునపుడు. 51

కం. కురిసెన్ బూవులవర్షము
మొరసెన్ సురమురజగణము బోరు కలంగన్
మురిసెన్ నిండుసభాస్థలి
విరిసెన్ భూసురునియాస్యబిసరుహ మెలమిన్. 52

కం. తరణికులేంద్రుని యానతి
శిరసా వహియించి విప్రశేఖరుఁ డాభా
స్వరవిగ్రహుఁడు గుమారా
బరిణయకార్యంబు జరిపె బళిరా యనఁగన్. 53

కం. ఈకథ చదివినవారును
లోకంబున విన్నవా రలోలాత్ములై
ప్రాకటధనపుత్రాయు
శ్శ్రీకంబులఁ బొంది రాము సేవింత్రు తుదిన్. 54

—:0:—

శ్రీరస్తు.

# ఆంధ్ర
# దూర్వాస రామాయణము

## శారికాకీర సంవాదము

నవరత్నంబుల సూర్యకాంతశిలలన్ నవ్యోపలౌఘంబులన్
ఛవులన్ గ్రక్కెడు శయ్యఁ గేళి వసతిన్ సంధించి భోగంబులన్
వివిధక్రీడలఁ దృప్తిఁ బొందుచు లసన్నీరేజపత్రాక్షుఁ డ
య్యవనీజాతనుగూడి రాఘవుఁడు నర్మాలాపసంపత్తితోన్. 1

శా. వీణారావవినోదసంతతులతో వేదాంత సద్గోష్ఠితో
నాణీయస్వర గీతికా సహిత వాద్యారావవిస్ఫూర్తితో
గాణిక్యప్రతినర్తనక్రియలతోఁ గాలంబునుంబుచ్చు న
య్యేణీలోచన సీతతో ధరణి నెంతేలీలఁ బాలించుచున్. 2

మ. జగదానందకకార్యబద్ధ పృథుదీక్షాచాతురీయుక్తుఁడై
భగవంతుం, డలభక్తవత్సలుఁడు సర్వప్రాణభృత్కోటికిన్
దగురీతిన్ సమరీతి నీతి దొలఁగన్ ద్రాణంబు జేకూర్చి యే
వగ, యేపారఁగనీక, నీతిగలుగన్ బాలించె సాకేతమున్. 3

ఉ. కోమలశబ్ద, మర్థ, మవకుంఠితభావము, మంజుశయ్యయున్
గ్రామము, రీతియున్, రసముగ్రాలు ధోకాటపుముద్దుఁబల్కులన్
రాముని యంతికంబున విరాజిలుచుండి కళాన్వితమ్ము చూ
డామణి పేరికీరము కడంకఁ బ్రమోదముఁగూర్చు నిచ్చలున్. 4

ఉ. కీరము దేశదేశముల కీలకముల్ గ్రహియించి యెప్పు డే
సార, మసారయుక్తమగుసంగతి సంభవమైన నప్పు డా
వీరుఁడు రామచంద్రునకు వీనులవిందుగఁ జెప్పుచుండ నా
హారము ముట్ట దొక్కక్షణమైనను నిల్వదు కూర్కునొందదున్. 5

కం. సీతాంతికమున సీతిని
కేతన సోమకయసంగఁ గేవలధిమణో
పేత సుశారికయొక్కటి
యాతతమోదంబుగూర్చి యలరుచు నుండున్. 6

చ. సరసర, సర్వశాస్త్రముల సారమెఱింగిన యవ్విహంగశే
ఖరములు రెండునున్ సకలకార్యకలాపముఁదీర్చి యొక్కపం
జరమున నే, నివాసముసల్పి, భుజించుచు నొక్కచోట నే
వరలుచు, వీడకొండొరులఁ బాలును నీరునుబోలె నుండగన్. 7

ఉ. కీరము మన్మథప్రదరకీర్ణము శారికఁజేరి భూరిసాం
సారికవాంఛ నిట్లనె 'నసారము దారవిహీనజీవనం
బారడమన్నమాట గలదా! భవవార్ధికి నౌకగా నినున్
దారనుగా గ్రహించెద, సుదారత, నానుడి, గారవింపుమా! 8

గీ. కలసి మెలసి యుండిన దంపతులను గాంచి
చిలుక గోరువంకలనుఁబోల్చి చెప్పుచుండ్రు
చిలుక గోరువంకలు మన మే చెలిమిలేక
మెలఁగ నేకవి యిఁక నుపమించు మనల. 9

కం. త్వరితగతి కలదికాలము
శరీరము లనిత్యములగు సౌఖ్యచయములుం
బరిమితము లనుభవింతము
తరువాత వగచినను ఫలితమొకండున్నే ?' 10

ఉ. కీరముపల్కు పల్కులకుఁ గింకిరిపాటును జెంది నవ్వుచున్
శారిక జ్ఞానహారిక 'ప్రశస్తుఁడ! ప్రాజ్ఞుఁడ! క్షేమదాయియున్
భూరిశుభావహమ్ముఁ బరిపూతము నాపలు కాలకింపుమా
కోరఁగఁబోను పూరుషులకూటమి నెన్నడు స్వప్నమందునన్. 10

మ. అతిదుష్టాత్ములుఁ, గ్రూరమానసులు, దుర్వ్యాపారపారంగతుల్
మతిహీనుల్, కరుణావిదూరులు, నహంకారుల్, కృతఘ్నాత్మకుల్
సతులన్ వీడెడు ధూర్తచిత్తులు, పరశ్యామారతుల్, కిల్బిషో
న్మతులుంగావునఁ బూరుషాధముల నమ్మన్ వచ్చునే కీరమా! 12

గీ. నిజమనోరథహారిక నిర్వికారి
కాధికారిక శారిక యనినమాట
కధికకోపపరీతాత్ముఁ డగుచు నపుడు
కీరపుంగవుఁడనెఁ గ్రోధగిరలు దొరల. 13

శా. క్రూరస్వాంతలు, మేకవన్నియపులుల్, ఘోరస్వభావాఢ్యలున్
ధీరల్, జారిణు, లిష్టచారిణులు, భర్తృప్రాణసంహారిణుల్
సారాసారవిచారదూర లనృతాసక్తల్, గభీరల్, మహా
మారుల్, నారులు, వారి నేరికిని నమ్మన్ వచ్చునే? శారికా! 14

కం. ఛీఛీ నీవాచాలత
మాచవిగానిది పురుషులమా ఎత్తకుమా!
ఛీఛీ నీవాచాలత
మాచవిగానిది వనితలమా ఎత్తకుమా! 15

గీ. అనుచుఁ గలహించి యొండొరు లౌనుకాద
టంచుఁ గుంజులాడుచు నిశ్చయించుకొనఁగఁ
దెలివిచాలక కలఁడుగా తీర్పుచెప్ప
రాఘవుండని వెడలి రా రాముకడకు. 16

మ. భవదూరాత్ముఁడు, రాజకార్యవిసరవ్యాఖ్యాతయుఁ, విస్ఫుర
ద్రవికోటిప్రతిమాన తేజుఁడు, మహాధర్మప్రతిష్ఠాపనా
ప్రవణుం, డారఘురామచంద్రుఁడు, సుధర్మాపీఠమధ్యస్థుఁడౌ
దివిజాధీశుఁడనంగ నొప్పఁగఁ బతత్రిద్వంద్వ మేతెంచుచున్. 17

కం. అరవిందములగు రాముని
చరణంబుల కమితభక్తి సంధిలఁగఁగరం
బెఱఁగి యెఱఁగించి కలహము
గోరువంకయుఁ జిలుక దీర్పఁగోరెను దగవుఁ. 18

మ. అపహాసంబొనరించి రాఘవుఁడు న్యాయస్థానమందుండి తా
న పరీక్షింపఁగ 'శారికా! నరకృతఘ్నత్వంబు స్థాపించి నా
వుపపాదించుచు నీదువాదమున కేమూహించితో హేతువుల్
శపథం బొప్పఁగఁజెప్పి యేదయిన దృష్టాంతీకరింపంగదే! 19

కం. అని పలికిన శారిక విని
వినయాన్వితమానసమున విని వేదింతుఁ
విను చెప్పెద నొక్కటిగా
దినవంశజ! పెక్కులనుచు నిట్లనిపలికెఁ. 20

చ. నరునవతారమెత్తిన జనార్దన దేవుఁడ వుగ్రదైత్యులఁ
దురమునఁద్రుంచి దేవతల దుఃఖముమాల్చిన వీరమూర్తి వీ
వురుషుల దుష్టకృత్యములు పోలిచిచెప్పెదఁ బక్షపాతముఁ
బొరఁగివరాకునఁ వినక త్రుంపుము భూవర! మావివాదముఁ.

చ. చదువులకాదిపీఠము ప్రశస్తచతుష్కులరాజధాని సం
పదలకుఁ గల్పకమ్ము కుసుమప్రకరోద్భవ గంధనిమ్నగా
స్పదము సుఖైకలక్ష్మికి నివాసము శ్రీమధురాపురమ్ము భూ
మి దివమనంగనొప్పు న మేయసదా విభవాభిరామమై. 22

చ. కలఁడొక వైశ్యవంశజశిఖామణి యార్థికదత్తుఁ డెంతయున్
లలితుఁడు ధీధనార్జనకళాకుశలాత్ముఁడు సంతతమ్ముఁ ద
జ్జలరుహనాభపూజనవశంవదచిత్తుఁడు దాతయుఁ దయా
కలితుఁడు ధర్మతత్పరుఁడు గాపుర మాపురి నేపుసూపుచుఁ. 23

ఉ. వడ్డికివడ్డి పెంచి పరివర్తనవృత్తిని గొంత పెంచి, యే
ర్పడ్డసువృత్తిఁ బెంచి, ధనరాశిని జక్కఁల జేని కేనియుఁ
జెడ్డి, యలంతివడ్డి కిడ నేర్చినద్రవ్యముతోడఁ బొల్చెడుఁ
బొడ్డునమానికం బొలసిపుట్టినవాఁడని చెప్పఁకో ప్రజల్. 24

గీ. గోనిచయరక్షణం బొక గొప్పదీక్ష
గగనమంటు ప్రాసాదముల్ గడనచేసె
ద్రవ్యరాసు లేయింటిలోఁ ద్రవ్వఁగొనిన
వానియైశ్వర్య మింతనివశమె చెప్ప? 25

చ. యువకుఁడు, మీనకేతను నటుండు మనంగ సమర్థుఁడౌ సురా
పవిభవుఁ డాతతాయి, యఘభాజనకార్యుఁడు, ద్యూతఖేలనా
వివశుఁడు, మద్యపాయి, పరివేష్టిత దుర్జనసంచయుండనన్
శివశివ! తత్సుతుండు చిరజీవి జనించె మహాఫలంబునన్. 26

కం. చిరజీవిత్వ మవగుణవి
సరమున నే నిలిచియుంటఁ జతురాస్యుం డా
పరమేష్ఠి యపుడు వానికిఁ
జిరజీవియని తగుపేరు చేసెఁ వాసిన్. 27

చ. జనకుఁడు స్వర్గమేగఁ బలుచాయల నాతఁడు సంచరింపఁగా
ధనము నశించె, భాగ్యము యథాయథలయ్యె, నశించె గోవు లే
పొనరినసర్వసంపదలు నూహలు మాత్రమయయ్యె, నౌర! దు
ర్జనములతోడి నెయ్యమున సర్వధనాంబుధు లింకిపోవవే? 28

కం. తఱుగన్ సంపదలెల్లను
దరిద్రుఁడయ్యెఁ జిరజీవి తన దేశమునన్
దొరకక భుక్తికి మార్గము
తిరుగంగాఁ దొడఁగె నన్యదేశములందున్. 29

చ. అలయుచు దేశముల్దిరిగి యంతట స్వర్గపురీమతల్లికిన్
జెలియలనంగనొప్పుచు విచిత్రముగా మలయాభిధానమై
చెలఁగుపురంబుఁ జేరి చిరజీవి స్వజీవికకై తలంచుచున్
దలఁచుచు నొక్కవైశ్యుని సుధామయధామముఁ జూచె దవ్వులన్

ఉ. చూచి, స్వకీయసౌధమును జూచినచాడ్పున లోనికేగి, సం
కోచముమాని, యోగిరము గోరఁగ దద్గృహమేధి పుష్పనా
రాచునిమించువానిఁ గని ప్రాభవమబ్బినరీతి వేడ్కమై
నాచిరజీవికిచ్చె వినయమ్మున నర్ఘ్యసపర్య లిమ్ముగన్. 31

చ. కలదు త్రిలోకసుందరి యొకర్తుక వానికిఁగన్య రూపమే
వలచునటన్నరీతి సుత వానినిఁగోరఁగ దండ్రియున్ మనం
బలరఁ గులంబు, గోత్రముల, నారసి, యాగమభంగి, వాని క
య్యలికచఁబెండ్లిచేసె నృప! యైదుదినంబులు 'ఫెళ్ళుఫెళ్ళనన్'

కం. బాలామణి రత్నావళి
నాలీలను నాలిఁజేసి యవ్వైశ్యునకున్
సాలంకృతి కన్యాదా
నాలక్షిత ఫలముఁగని కృతార్థుండయ్యెన్. 33

కం. చిరజీవి దారయుతుఁడై
పురుహూతసుఖోపమాన భోగము లందెన్
'పరమసుఖం శ్వశురగృహం
బరయఁగ' ననుప్రాఁతమాట కాతఁడ గుఱియై. 34

గీ. ఎల్ల సౌభాగ్యములుఁ దలయెత్తికొనియె
పరమదారిద్ర్యమది పటాపంచలయ్యె
తగులుకొనె వానిమనము జూదమున మరల
కట్ట! యెంతపాపిష్ఠమో కద! ధనంబు. 35

కం. వ్యసనోదయుఁడగుచున్ ద్యూ
తసమారంభమునకుఁ గృతితాత్పర్యుండై
యసదృశకితవులుగల స్వపు
రసమీపముఁ జేరఁబోవ రభస మెలర్పన్. 36

చ. మనమున నున్న మర్మముల మామకుఁ జెప్పక స్వీయదేశమున్
గనుఁగొనువాంఛ యగ్గలము గ్రక్కున వత్తునటంచుఁ దెల్పఁగాఁ
దనయ పరార్థమే యనుచుఁ దద్దయుఁ జింతిలి యత్తయింటికిం
బనుపఁగ నాయితంపఱచి పంపెను వృద్ధనొకర్తుఁ దోడుగన్. 37

ఉ. మువ్వురు సాగనంపఁబడి పోవుచునుండి రరణ్యసీమ నా
జవ్వనిముందు, వెన్క, వరుసన్, ముసలామెయు, భర్త, యేగుచో
నవ్వరుఁడింతిఁ జూచి లలనా! కడుభద్రముసుమ్మ యున్న వా
రివ్వనిఁ జోరులంచుఁ బ్రకటించెను లేనిభయంబు వారికిన్. 38

ఉ. ఓరఘురామచంద్ర! వినవో చిరజీవి కృతఘ్నభావమున్
గ్రూరత, దుష్టబుద్ధియు, నకుంఠితఘాతుకవృత్తి, మోహనా
కారసమేతయైన నిజకాంతశరీరమునందు వెల్గు బం
గారపుభూష లొల్చుకొనఁగా జనియించె నయోగ్యభావమున్. 39

గీ. సహజభీరువుగాన నచ్చానమిన్న
భూషణములన్నిఁటి నొలిచి మూటగట్టి
చిత్తజాకార! చాలజాగ్రత్తయంచుఁ
జెలువుదళుకొత్తఁ బ్రియభర్త చేతఁబెట్టె. 40

గీ. ద్రవిణలోలుపబుద్ధి యత్తరళబుద్ధి
పేర్మియసియు, వృద్ధయును పాపభీతిలేక
కూలఁద్రోసి యిర్వురఁ బెద్దగోతిలోన
భర్మభూష లపహరించి పాఱిపోయె. 41

చ. పడినక్షణంబులో ముసలివా సెను బ్రాణము వృద్ధకావునన్
బడఁతి దృఢాంగ సౌష్ఠవవిభాస్వరకావున మెల్లమెల్లగా
నొడికముతోడఁ ద్రాఁకిపయి కొయ్యనఁ దండ్రిగృహంబుఁ జేరెఁదాన్
బుడమిని నూకలున్న యెడ భూతము మ్రింగిన నేమి రాఘవా! 42

చ. కనుఁగవ వాఁడువాఱుటయు గాత్రము గ్లానివహించి పాలిపో
యినగతినుంటఁ దండ్రిగని 'యెచ్చట నీప్రియభర్త తోడుగా
ననిపినవృద్ధయెక్కడ కటా! యిటులుండఁగ నేమి తల్లి' యం
చును జనకుండు దుఃఖపడుచో విను మాసతి యేమి చెప్పెనో. 43

ఉ. భర్తను బైటఁ బెట్టు టతిపాపమటంచుఁ దలంచి 'నాయనా!
ధూర్తులు చోరశేఖరులు దుర్గమకాననసీమఁ జొచ్చి నా
భర్తను పాశసంచయనిబద్ధునిఁ జేయుచు నన్ను వృద్ధనుఁ
గర్తములోనఁ ద్రోయుచు నగల్ హరియించి రికేమి చెప్పుదున్.

ఉ. బద్ధునినాపతిం గొనుచుఁ బాపమలిమ్లుచు లేగినార లా
వృద్ధయు గర్తమందుఁబడి యీల్గె నభాగ్యను నేను మఁటేనం
చుద్ధురరోదనావశత నుండఁగఁ దండ్రి 'కుమారి! శోకసం
విద్ధవు గాకుమా! పతినిపీడరె యర్థము కోరుతస్కరుల్. 45

మ. అని రత్నావళి నూరడించుటయు నయ్యబ్జాక్షి యాత్మేశు చిం
తన మశ్రాంతముఁ జేయుచుండి పతినే దైవమ్ముగా నెంచుచుఁ
దినముల్ ద్రోయుచునుండె, భర్త కితవాదేశంబునన్ దేశమం
దున జూదంబున నెల్లఁగోల్పడె సుహృద్ద్యూతంబులుంగూడు నే. 46

కం. నష్టద్రవిణుండై యు
దుష్టాత్ముఁడు తుష్టిమాలి ద్యూతమునఁ బున
స్సృష్టియొనర్పఁగ ధనమును
శిష్టునివలె శ్వశురగృహముఁ జేరఁదలంచెన్. 47

చ. అడుగకయుండునే శ్వశురుఁ డాత్మకుమారిక క్షేమవార్తఁ దా
నడిగిన నేమి సౌఖ్యనివహంబున మున్గుచుఁ దేలుచున్న దే
యిడుమయు లేకయంచు వచియించెదనంచుఁ దలంచి వచ్చె నా
తఁడు పతిఁజూచి తొల్దొలుతఁ దత్తరుణీమణి మోదమగ్నయై. 48

కం. పితరునకుం జెప్పినగతి
గతవృత్తముఁ బతికిఁజెప్పి కలుషం బుడిపెన్
పతి యెంతదుష్టుఁడైనను
సతి యతఁడే దైవమనుచు సంభావించున్. 49

కం. అల్లుఁడు చోరవిముక్తుం
డిల్లాలి యదృష్టమంచు నెల్లరుఁ బలుకన్
పెల్లుల్లసిలి శ్వశురుఁ డూ
రెల్లఁబనిచె నుత్సవంపు టేపు ఘటిల్లన్. 50

ఉ. కప్పురగంధిసేవలను గాలముఁబుచ్చుచు మామచిత్త మం
దుప్పొనవ్రాలె మోదరస ముప్పతిలంగఁ జరించుచుండి తా
నప్పన మెప్పు డింక సమయమ్ము ఘటిల్లునటంచుఁ జూచుచున్
జెప్పఁగ నోరురా దవలఁ జెప్పకతప్పదుగాదె రాఘవా! 51

శా. ఏకాంతంబున నేకశయ్యపయి నిద్రైకాగ్రితంబొందు నా
రాకాచంద్రనిభాస్య, నాగుణమణిన్, రత్నావళిన్, గత్తి చే
వీకన్ ఖండనఁజేసి భూషణములన్ వే యొల్చి యారాత్రి పా
పాకారుండు స్వదేశ మేగె నరపాలా! చేతులెట్లాడెనో? 52

కం. కావునఁ బూరుషు లనఁగా
జీవహారులు, దుష్టు, లదయచిత్తులు, దేవా
యేవేని తప్పులుండినఁ
బ్రోవంగదె యనుచు శారి పోలిచిపలుకన్. 53

గీ. శారికావాదమునకుఁ దచ్చక్రవర్తి
వింతమీఱి నిశ్చేష్టుఁడై కొంతతడవు
ఒక్కపక్షంబ విని తీరుపొప్ప దంచుఁ
జిలుకఁ జూచి వాదింపఁగా సెలవొసంగె. 54

కం. కీరం బరుదెంచుచు నా
శ్రీరామపదాబ్జములకు స్థిరభక్తి నమ
స్కారసుమపూజ సలుపుచుఁ
బ్రారంభముఁ జేసె స్వీయవాదముఁ బేర్మిన్. 55

కం. జిష్ణుఁడ, వఖిలజగద్వ
ర్ధిష్ణుఁడవు, సహిష్ణుఁడవు, క్షితిపతీ! సాక్షా
ద్విష్ణుఁడ, వస్మద్వాదము
నిష్ణాతమతి విని తీర్పు నెమ్మిం జెపుమా! 56

ఉ. నారులు దుష్టమానస, లనార్యలు, కార్యపరంపరన్, మహా
జారిణులున్, ఖలాత్మకలు, సత్యవిహీనలు, ఘోరకార్య వి
స్తారలు, క్రూరచిత్త, లతిదారుణకృత్యకదంబలంపటల్
చేరరు వారలన్ బురుషసింహులు విన్మ యుదాహృతిన్ నృపా! 57

శా. చంద్రాశ్మప్రకరాంచితోన్నత సుధాసౌధాగ్రభాగాళితో
సాంద్రోద్యానసుమప్రవన్మధుమిళత్సారంగసంపత్తితో
తంద్రాదూరసుగీతికాసముదయోదారాండజశ్రేణితో
చంద్రాభిఖ్యపురమ్ము పెంపెసఁగు సత్సంతానసంసేవ్యమై. 58

ఉ. అందుఁగలండు కేశవపదాంబురుహామృతపానచిత్తుఁ డ
స్పందితభక్తి తత్పురుఁడు సంస్కృతమానసుఁ డార్యరాణ్మనో
విందుఁడు సత్యవాగ్రతుఁడు వృద్ధశిఖామణి యూరుజాన్వవా
యేందుఁడు ధీయుతుండు నృపతీ! ధనచిత్తుఁ డుదాత్తుఁ డెంతయున్

గీ. ఆతనికిఁబుట్టె గారాబుఁ గూఁతురొక తె
యధికధైర్యంబుగలది సాహసముగలది
పంచబాణుని యారవబాణమనఁగ
వెలయు వసుదత్త యనియెడి పేరితోడ. 60

చ. అనుపమబుద్ధిచాతురి బృహస్పతినేలినవాని, సోయగం
బున నవపుష్పసాయకునిఁబోలినవానిని, నర్థసంపదన్
ధనదునిమించువాని, గుణధన్యుని. విద్యలమాన్యునిన్, వరున్
వినయవివేకసంపదభివృద్ధినిఁ బుత్రికిఁ బెండ్లిసేయఁగన్. 61

చ. తిరిగి యనేకదేశములు దివ్యవరార్థగవేషణార్థ న
ప్పరమగుణప్రకాండమున భాసిలునొక్కనిఁ జంద్రచూడుఁడన్.
వరుఁగని తామ్రకేతనమనందగు పట్టణరాజమందు సా
దరముగ వానికిచ్చి వసుదత్తను బెండిలిచేసెఁ బేరిమిన్. 62

కం. వసుదత్త పుట్టినింటన
వసియించుచు జవ్వనంబు పైకొనఁగా దు
ర్వ్యసనముల కగ్గమయి తా
విసుమానముగాఁగఁ దిరుగు విటసంతతితోన్. 63

గీ. దారసంగతికాంక్ష విస్తారయశుఁడు
చంద్రచూడుఁడు ప్రాపించె శ్వశురగృహము
క్రొత్తజామాతరాకఁ దళ్కొత్తఁబ్రీతి
నత్తమామలు సమ్మోదాయత్తులైరి. 64

కం. తనవిద్యయందుఁ గ్రమముగ
వనితామణి యాఱితేరె వసితలు నరులన్
గనుఁబ్రామి యెంతలెంతలు
నొనరింపఁగఁజాల రిదియు నొకయద్భుతమే? 65

చ. అమలమణి ప్రకాండఖచితామల మందిరమధ్య స్వర్ణమం
చము నమరించి సూనముల శయ్యనుగూర్చి సుగంధవస్తువుల్
ఘుమఘుమఘుంఘుమ ప్రకరఘూర్ణితభావము నొందునట్లుగా
నమరిచి యారతీస్మరుల నాల్మగలన్ గదిలోని కంపఁగన్. 66

కం. లోకోత్తరసుందరి నా
లోకించి ధవుండు సురతలోలుపబుద్ధిన్
జేకొనఁబోవఁగ నందిటఁ
జీకాకునఁదోసె బతి నిసీ యనిభూపా! 67

చ. పెడమొగమున్ ఘటించుఁ బతి ప్రేమఁ గనుంగొనఁబోవఁ జేరఁబో
నెడముగ నొత్తిగిల్లి నటియించును నిద్ర విటుందలంచుచున్
నుడువదు, వీనులొగ్గదును, నూల్కొని చూడదు, సేవ సేయదుక్
గడుపున లేని ప్రేమ క్షితినాయక! వచ్చునె కౌఁగిలించినక్. 68

గీ. దొంగనిద్ర మునింగి యాతోయజాక్షి
యెంతపిల్చినఁ బల్కదొక్కింతయైన
నొక్కచోఁ దనువు, మనసింకొక్కచోట
విప్రమోష్ఠుల నెవ్వఁడు విశ్వసించుఁ 69

చ. పతితనసర్వశక్తి బహుభంగుల యత్నముఁ జేసిచేసి య
య్యతివప్రవర్తనంబునకు, నచ్చెరుపాటును, దుఃఖపాటునొం
ది, తగనిపాటు, వాటిలెఁగదె యను చింకొకమారి కొక్కమా
రతఁడు ప్రయత్నముల్సలిపె నామెను ముద్దుగఁ బల్కరింపఁగన్.

చ. శివశివ! యేమిచెప్పఁ జెలి శీలవిధమ్ము, నిమీలితాక్షియై
యవిరళనిద్రలోమునిఁగినట్టుల నూఱకువుఁ బుచ్చు, భర్తయున్
దవిలి నిరీహ లేదుఫలితంబని గాఢసుషుప్తిఁ బొందెన
య్యువిద ధవుండు నిద్రిలుట నొయ్యనఁ జూచి విస్మితాత్మయై.71

చ. స్థిరపఱుపంగ నిద్రఁ దనశీర్షము నెత్తుచుఁ జూచు దిక్కులం
దురవడి, దోర్లు నిట్టటులు నూరక చూచు, మొగంబు చక్కికిన్
వెరవునఁ జేయు శబ్దతతి వెల్విచలేన్ మరి వేనవేల యూ
చౌఱపపనుల్ విచిత్రములు చూడుడ దెంతటి టక్కులాఁడియో!

ఉ. జారనిబద్ధచిత్తమున సారసలోచన కుందికుంది యే
తీరునఁ బోదు నాప్రియుఁడు తీవరపాటును బొందుచుండు వి
స్తారము సంవిదుర్వ్రరను జాగున కాగ్రహమొందునో యటం
చారటమందుచుండు నెడ నద్భుతమొక్కఁడు వొల్చె నచ్చటన్.

కం. చోరాగ్రసరుఁడు భిత్తి
ద్వారంబునఁ గన్నమొందు ద్రవ్వి విమోహా
కూర్ర యది చూడకుండ న
గారంబున మెల్లమెల్లగాఁ జొఱఁబాఱెన్. 74

శా. నిద్రాముద్రితుఁడైన భర్తఁ గనుచున్ నిర్భీతి నిర్లజ్జ రా
జద్రాజీవదళాక్షి శయ్యడిగి నల్చాయల్ గవన్ భిత్తికా
ఛిద్రంబుంగని మోహ ముప్పతిల యోజింపంగ నేలా? బళీ!
భద్రంబై తగుమార్గమబ్బెననుచున్ భావించి యొక్కుమ్మడిన్.75

చ. ధవు విడి నిర్గమించె వివృతంబు, విశాలమునై యెసంగు త
ద్వివరమునుండి యప్పుడఁతి తెక్కలికాఁ డిదియేమిచిత్రమో?
యువిద నిశాంతమువ్విడిచి యొంటరిపాటున నర్ధరాత్రమం
దు వెడలుచున్న దెచ్చటికి దూఁతునో కాంచెదనంచు వెంబడిన్.

కం. పడిపోవుచుండె వనితయు
వడివడిగానడచి కొంతవఱ కొకచోటన్
దడవయ్యె సకియ రాదని
తడఁబడు శంభళినిఁజూచెఁ దాత్పర్యమునన్. 77

ఉ. కాటుకపూఁతయోయన జగంబున ధ్వాంతముగ్రమ్మఁ బ్రేమ ను
ద్ఘాటన సేయుచుండి విటతత్పరమానసయై లతాంగి య
చ్చోటికి దారిచూపఁగ నిసిక్ భయమింతయులేక తద్వనీ
వాటికలోన నెప్పటి నివాసముఁ జేరుచుఁజీరె మిండనిన్. 78

ఉ. ఆతరళాక్షిఁగూడ సమయక్షితి కవ్విటుఁ డేగుదేరఁగా
నాతని దొంగగాఁదలఁచి యచ్చటిరాజభటాళి వానినిక్
బ్రాఁతిగఁబట్టి ముష్టితలపాతములక్ బ్రహరించి తోన ని
శ్చేతనుఁజేసి చెంతఁదరుసీమకుఁ జేరిచిపోయి రొక్కటన్. 79

ఉ. అమ్మదిరాక్షి మిండనిఁబ్రియంబునఁ జీరినఁ బల్కకున్నఁ గ్రో
ధమ్మదయించె వాని కని దగ్గరఁజేరినతోడ రెండుమూ
డమ్మలవానియేటులకు నగ్నమయైయది పీడి జ్ఞానమున్
నెమ్మనమందు నవ్విటుని నిల్పి క్షమింపఁగ వేడి వేడుకక్. 80

కం. తన్మయతఁబొంది పూవుల
నున్మత్తతఁ బూజచేసి యొయ్యన గంధం
బు న్మదమును బూయుచు మో
హోన్మాదమ్మున శవమ్ము నుత్కంఠమెయిక్. 81

ఆ. వె. కౌఁగిలించుకొనుచుఁ గసిదీఱ వసుదత్త
పురుషునాననంబు ముద్దుగొనియె
రామచంద్ర! పిదప నేమేమిజరిగెనో
సిగ్గు నవ్వు వచ్చుఁ జెప్పుకొనఁగ. 82

ఉ. అంతటఁ దత్సమీపమహిజాగ్రమునంగల బ్రహ్మరాక్షసుం
డెంతయు నష్ట రేఁగుటయు నెత్తినవేడ్కనునించి తచ్ఛవా
భ్యంతరమందుఁజొచ్చి యురియాడుచు గ్రక్కున దానినాసికా
దంతశిఖావళిం గొఱికెఁ దద్దయు రక్తములొల్క రాఘవా! 83

కం. ముక్కూడినపుంశ్చలి పెం
పెక్కినపొక్కనుస్రుక్కి యిటునటు చిందుల్
ద్రొక్కుచు హా! హా! యను ము
న్నిక్కరణినొనర్చి యెఱుఁగ విదియేమి యనున్. 84

కం. ఆలస్యపుఁ దప్పిదమున
కీలీల విధింపనగునె? యేవపుశిక్షన్
చాలుర! ముక్కూడిన పోరి
యాలనఁబ్రియ! నీకె లజ్జయానుంగదరా! 85

కం. ఊహించి యిట్లు వెండియు
మోహాంధాతమసమందు మున్గుచును వరా
రోహా విటు సమీపింపఁగ
నాహా! కుణపస్థభూత మంతర్ధిఁగనెన్. 86

కం. అంతర్ధానము నొందిన
యంత శవంబు భయదవికృతాకారముతోఁ
గాంతకుఁదోఁచఁగ దుఃఖా
క్రాంతయగుచు యోజనావిరహితయు నగుచున్. 87

ఆ. వె. జారుపొందువోయె జారుండునుంబోయె
ముక్కుకూడఁబోయె నక్కటకట!
తుదకుఁబతియుఁగూడ దూరగుఁడైపోయె
వొడ్డపన్నుగడయుఁ దోఁచదాయె. 88

గీ. అనుచు, విలపించుఁ, దులకించు, నాలకించుఁ
గలవరించు, హసించుఁ, జికాకుఁగాంచుఁ
బన్నుగడ నెంచుఁ, దలకించు, బాగటంచు
మించుమించును, వెలయించు, మించుఁబోఁడి. 89

ఆ. వె. ఆపె ననుసరించినట్టి తెక్కలికాఁడు
కడుపు చెక్కలైనకరణి నవ్వి
యేమి చిత్రికార్య మింకపై జరుగునో
యనుచు ననుసరించె నాలతాంగి. 90

కం. ఏరంధ్రంబున వెడలెనో
యారంధ్రమునుండి లోనికరుదెంచుచు ని
ద్రితుఁ బతినిఁగని కులట
నేరుపుమెయి బిలముమూసి నీరంధ్రముగన్. 91

ఉ. నాపతి మంచివాఁ డనుచు నమ్మి సమీపముఁ జేరుకొంటి ముం
గోపి, దురాత్మకుండుఁ, గడుఁగ్రూరుఁడు, జాల్మఁడు, ధూర్తుఁడయ్యయో
ఓపిత! యోసితల్లి! యెటులోర్తునొ చెప్పఁగదమ్మ? ముక్కు ని
ట్టే పరికించుచున్ గొఱికె నేగతిఁ గాపురమంచు నార్చినన్. 92

గీ. బాలికాక్రోశనము చెవిఁబడినతోడ
భర్త మేల్కాంచుటయు నెల్లవార లటకు
వచ్చుటయు నొక్కపర్యాయ మచ్చుపడియె
వింతగా నిట్లుపలికిరి కొంతమంది. 93

కం. శిక్షింపుఁడు, భక్షింపుఁడు,
నిక్షేపమువంటిపిల్ల నిద్దపుముక్కున్
వీక్షించి, కొఱికె నపురా!
రక్షఃపతికానికాఁడురా పతియనుచున్. 94

ఉ. అల్లుని గాఢపాశనిచయమ్ముల బంధనఁజేసి ధారుణీ
వల్లభుసమ్ముఖమ్మునకు వచ్చి నివేదనచేసి రంత నా
పిల్లను గన్నులార పృథివీపతిచూచుచు 'నొల్లవచ్చు నీ
వొల్లకపోవవచ్చు నిటులోదురితాత్మక! చేయవచ్చునే'? 95

ఉ. ఎక్కడ నేని లేరు హృదయేశ్వరిముక్కు గ్రసించువారు మీ
రిక్కటినాత్మమస్తము నింతలునింతలుగాఁగఁగొట్టి యా
ముక్కలు కాకిగ్రద్దలకు భుక్తినొసంగుఁడు లెంకలార! యిం
కక్కట! సాక్ష్యమేల? యిది మైంద్రియకంబయి పొల్చెనం చనన్

మ. కనులారన్ గతవృత్తమంతయును సాకల్యంబుగాఁగన్న య
య్యనఘుం, డాగజదొంగ, త్రుళ్లి పడియయ్యయ్యో యిదన్యాయమో
మనుజాధీశ్వర! చందిమూఁడఁ డతిధర్మస్వాంతుఁ డీటక్కుజ
వ్వని దుష్టాత్మక, అంకులాడి, దురితవ్యాపార, మోజింపుమా! 97

గీ. సత్యమిదినుండి నాతోడ సాఁగిరండి
యతివముక్కును జూపెదనంచుఁ బలుక
నందరాశ్చర్యమునుబొంది రధిపుఁడంత
చోరు వెంబడించెను పాదచారి యగుచు. 98

గీ. శవముఖబిలంబునందున్న చానముక్కు
నచ్చముగఁజూచి భూవరుం డబ్రమంది
యుల్లము చలింప నల్లంత డిల్లవోయి
తత్త్వము గ్రహించి కుందె గతమ్ముకొఱకు 99

ఉ. వింటివె రామచంద్ర! యతివిస్మయకార్యముగాదె యెట్టివా
ల్లంటియు నిట్లొనర్చుటకుఁగా సమకట్టునె యెవ్వఁడేని నా
తొంటరి గుబ్బలాఁడి నతిదుష్టఁ దలంచినఁ బాపమంటు న
య్యంటినపాపమార్పనగునా! శతజన్మములెత్తినన్ గటా! 100

మ. పతిదా నెంతటి దుష్టుఁడైన నతిదౌర్భాగ్యుండ యైనన్ రమా
పతిగాఁగన్ బతినెంచు సాధ్వికగు సౌభాగ్యంబు లంచన్న చో
నతికల్యాణగుణప్రకాండుఁ డతిధర్మాత్ముండు నత్యుత్తముం
డతిలోకుండగు వానిఁ గొల్చు సతి కాహా! యేది దుస్సాధమా.

మ. పతిహంత్రిన్, వసుదత్తనుం, జెడిపెనుం, బాపార్ణవోరాశి, దు
ర్మతినిం గ్రూరను, మాయలాఁడిని, మహామారిన్, దయాదూరురై
కౌతుకం బొప్పఁగఁ గుత్తుకందఱిగి యక్రూరున్, గుణాధారు, సం
స్తుతిపాత్రున్, ఘనుఁ, జంద్రచూడు, విశుమంచున్ రాజు శాసించె దాన్

కం. కావున నారులు, ఘాతుక
లావిద్ధగమనలుఁ, గఠిన, లనుచున్ గీరం
బేవం విధి వచియింపఁగ
ధీవిభవుఁడు రాముఁ డిట్లు తీరుపుఁ జెప్పెన్. 103

చ. పురుషులకంటె భామినులు, భూరిభయంకరరూప, లైచ్ఛికా
చరణలు, మాయికల్, ఖల, లసాధ్యలుఁ గ్రూరపథానువర్తనల్
దురితవిచేష్టితాత్మికలు, దుష్టలు, ధూర్తలునంట శాస్త్రసు
స్థిరము సనాతనమ్మె శ్రుతిసిద్ధవినిర్ణయసార మార్గమున్. 104

కం. ఔరా యని రపుడు సభా
స్థారులు జేజేలు విరులజడి గురిసిరి త
త్కీరము సంతోషించెను
శారిక లజ్జాభరాలస హృదయ యయ్యెన్. 105

—:0:—

శ్రీ ర స్తు.

# ఆంధ్ర
# దూర్వాస రామాయణము

## సింహాహననోపాఖ్యానము

చుట్టిన పటుజటాజూట కోటీరంబు
జరఠారుణాతపచ్ఛటలు గురియ
పూసిన కమనీయ భూరి భూతి స్ఫూర్తి
సాంద్రచంద్రప్రభాజాల మొలుక
తాల్చిన యజ్ఞసూత్ర ప్రభాగరిమంబు
భుజగ నిర్మోక విస్ఫూర్తిఁ గొలుప
పట్టినపావనస్ఫటికాక్షమాలిక
యోంకారమంత్ర రాజాంక మీన

గీ. హస్తపల్లవఘటిత వియన్నదీ ప్ర
పూత జలపూర్ణకుండికా ముఖ్య సకల
పరమయోగీంద్ర లక్ష్మ లొప్పార వచ్చి
వాలఖిల్యులఁగాంచె దూర్వాసమౌని. 1

శా. రుద్రాంశ ప్రభవాభిరాముని, దపోరుంద్ర ప్రభాధాముని న్
భద్రాకారుని, రోషభాషణకళాపాండిత్య ధౌరేయు, ని
ర్నిద్రుల్, మౌనులు, వాలఖిల్యులు, మహానిష్ఠాగరిష్ఠాత్మ ల
క్షుద్రప్రక్రియ భక్తిఁ మ్రొక్కి కరముల్ జోడించి యమ్మౌనికిన్,

శా. అయ్యా ! మీరలు పుణ్యపూరుషులు మీయాస్యావలోకంబునన్
బ్రయ్యెల్ వారె సమస్త కిల్బిషగిరుల్ రామావనీనాథు పే
రొయ్యొయ్యన్ జపియించుచుండి సతతం బోష్ఠోలగంబందు బల్
నెయ్యంబొప్పఁగఁ జూతు రాప్రభుమణిన్ నిర్వాణసంధాయకున్. 3

ఉ. అక్షయమోక్షదాయి, పరమాద్భుత రక్షణదక్షమంత్ర హా
ర్యక్షము, పంచపాతకమహావసుధాధరతుంగశృంగభే
దక్షమవజ్రధార, పరదారధనాహరణాహిబర్హి, యా
ద్వ్యక్షరి, రామమంత్రమహిమాతిశయంబు నుతింపశక్యమే ? 4

సీ. రామమంత్రోచ్చారణా మహిమంబుచే
సప్తసైంధవు తేరు సాఁగుచుండు
జానకీపతినామ జాపప్రసిద్ధిచేఁ
జతురాననునిసృష్టి జరుగుచుండు
శ్రీరామమంత్రసంసిద్ధిప్రకర్షచే
జలజనేత్రునిసంస్థ వెలయుచుండు
రఘురామమంత్రపారాయణప్రతిభచే
శితికంఠు లయశక్తి చెలఁగుచుండు

గీ. రామనామసంస్మరణ మాత్రంబుచేత
నిఖిలలోక కదంబంబు నెగడుచుండు
నట్టి శ్రీరామచంద్రరాజ్యంబునందు
నేమివింతలు చెప్పమా ఋషికులేంద్ర ? 5

ఉ. భానుఁడుదొట్టి రాజ్యపరిపాలనచేసిన సూర్యవంశభూ
జానులలోన నేనృపుఁడు చంద్రపదంబు వహించి యిష్టసం
ధాన మొనర్చి కూర్చె 'చదిధాత్వఖిలార్థము' రామచంద్రభూ
జానియొకండుదక్క దివిజప్రజవంద్య ! తపస్విపుంగవా ! 6

కం. అన విని ముత్పులకలు నెల
కొనఁదనువున నెడములేక కూరిమి యిగుఱొ
త్తిన వినుఁడని యమ్మునులకు
నినవంశజు రాజ్యచరిత మీాగతిఁ దెల్పెన్. 7

చ. అనలపరీక్ష కాగిన మహాసతిసీతయె యాఁతగా మహా
త్మ నెసఁగులక్ష్మణుండు తగుదాసుఁడుగా భరతుండు ప్రాపుగా
ననుపమశౌర్యరాశి లవణాంతకుఁడుండగ రాముఁడేలు స
జ్జననిలయం బయోధ్య రిపుజాతి కసాధ్య స్వరాజధానిగన్. 8

చ. ఉరుతరభంగసంగతి మహోదధియందె ఘటిల్లు వర్ణసం
కరములు చిత్రకారకునికల్పనలందె చెలంగు విజ్ఞపీఁగుటల్
తరుణులయున్నతస్తనములన్ గనవచ్చునెకాని యింక స
ప్పురజనులందు నెందయిన ముచ్చటకైనను గానవచ్చునే. 9

ఉ. జారులు, చోరు, లావృతవిచారులు, భీరు, లసత్యవాదు, లా
చారవిహీనవర్తనులుఁ, జంచలచిత్తులు, శీధుపానవి
స్తారులుఁ, గ్రూరులున్, జదువుసంధ్యలులేక మెలంగువార, ల
వ్వీరుని రాజ్యమందుఁ గనిపింపరు ముచ్చునకైన నెచ్చటన్. 10

ఉ. వేదముమానఁ డెవ్వఁడును విశ్రుతశాస్త్రములున్ స్మృతులు పురా
ణాదులయందు లక్ష్యమొకఁడైనను దప్పఁడుఁ దల్లిభాషనుం
గాదని యన్యదేశములగాడిదిగత్తరవిద్య లెందు సం
పాదనచేయుచున్ బసికిమాలినశుంఠలుగారు ఛాత్రికుల్. 11

ఉ. విశ్రుతకీర్తనీయులగు వీరవరేణ్యులు ఫాలనేత్రునే
నశ్రమ నోటఁబుచ్చఁగల రాజ విరాజిలి యెల్లవారలున్
బ్రశ్రయసంపదంబొదలు పావనశీలురు వారివారి వ
ర్ణాశ్రమధర్మకర్మనివహంబులఁ బాఁడినిఁదప్ప రెప్పుడున్. 12

ఉ. యాచకుఁడందు నెందునకునైన లభింపఁడు మాటిమాటికిన్
వేఁచియు రాచి ఱంపమునఁ బెట్టరు మర్త్యులఁ బన్నుబందులన్
వాచవికైన లంచమును బట్టరు యత్నములందు నొక్కటే
'నీచుకపోవ' దెప్పుడు మహీపతి రామునిపాలనంబునన్. 13

ఉ. తుష్టి ద్విజౌఘమం దెసఁగుఁ దోరముగా నృపపాళియం దసం
తుష్టి ఘటిల్లు వైశ్యులకు దుర్నయమన్నది లేకయే తులా
యష్టిని దృష్టి కష్టపడుటంతయుఁ బాదజులందు లేదనా
వృష్టిభయంబు నాస్తి యతివృష్టి సువృష్టి ఘటిల్లుఁ బుష్టిగన్. 14

మ. అహిరాడంశభవుండు లక్ష్మణుఁడు దివ్యాస్త్రంబులం బూని లో
కహితార్థంబుగ నేలు రాఘవునివంకన్ లెంకయై నిచ్చలున్
బహిరంతస్తనుశుద్ధి నూడిగము నానాభంగులన్ జేయుచున్
మహిమంబొప్పఁ జరించుచుండె జనసమ్మానార్హావృత్తంబునన్.

ఉ. ఆరఘురామచంద్రుని మహామహిమంబు నుతింతునంచు న
య్యారగసార్వభౌముఁడు సహస్రముఖంబుల సల్పి సన్నుతుల్
తీఱని యోటమిం బడె నిలింపులపందెమునందుఁ గాని చో
నారఘురామచంద్ర చరణాబ్జము లంటి చరింప నేటికిన్. 16

చ. ధనికుఁడు, వేదపారగుఁడు, ధర్మపరాయణుఁ, డగ్నిహోత్రి, స
జ్జననుతిపాత్రుఁ, డర్థిజనసారసమిత్రుఁడు, సర్వదేవతా
మునిసుజనార్చనాపరుఁడు, పుణ్యగుణాఢ్యుఁడు, యజ్ఞసోముఁ, డ
య్యనుపమపట్టణంబున ననంతసుఖంబులఁ దేలియాడుచున్. 17

చ. జలజము లేనిపుష్కరిణి జాబిలి లేని కపర్దిమస్తకం
బలరులు లేనిపాదప మహర్పతి లేని నభోంగణంబు ని
మ్ములఁ దలకట్టు లేని లిపిపోలిక పుత్రుఁడు లేని పుట్టువం
చలఁదురి యెల్లవేళల ధరామరుఁ డాత్మసతీసమేతుఁడై. 18

చ. హరిపదపూజలం దహరహంబుఁ జరించుచుఁ జీనుపుట్టలం
దిరవుగ ఖండశర్కరల నింపగు తండులఖండముల్ నిరం
తరముఁ బ్రభాతమందు సతితత్పరవృత్తి ఘటించి యిందువా
సరనియమంబులన్ సలుపసాఁగె నచంచలభక్తి యేర్పడన్. 19

ఉ. విద్రుమదానమిచ్చు నల వీనులకంటి ప్రతిష్ఠఁజేయు బో
ధిద్రుమరాజముల్ గని తితిక్షఁ బ్రదక్షిణ మాచరించు హా
రిద్రఘురాంచితంబు నతిరిక్తవినీలసవత్ససౌరభే
యీాదప్రవిణంబు దానమిడు నిద్ధమహీసురకోటి కాస్థమై. 20

కం. తొమ్మిది గాములజపమున్
సమ్మతి హోమమ్ము లధికసంతర్పణ లిం
కెమ్మెయి నెవ రెవి చెప్పిన
నమ్మి యతఁడు దైవచింతనమ్మున మెలఁగెన్. 21

మ. నిగమాంతప్రతిపత్తి గల్గిన మహానిష్ఠాగరిష్ఠాత్ముఁడా
జగతీనిర్జరచక్రవర్తికిఁ దనూజాతుండు జన్మించెఁ బె
న్వగలం దూల్చుచు దేవసోముఁడను శుంభత్ప్రఖ్యఁగై సేయుచున్
భగవత్సేవల బొందరానిఫలముల్ భావింపగాఁగల్గునే! 22

చ. వినయవివేకసంపదలపెన్నిధి, విద్యలకున్కిపట్టు, క్రొ
న్ననవిలుకానికీరితికి నానఘటించెడు మేలిసోయగం
బునకు నివాసభూమి, జనముల్ దను నిచ్చలు నెత్తిఁబెట్టుకో
ననువగువర్తనంబునకు నాలయసీమయనంగఁ బొల్చుచున్. 23

కం. పదునాలేఁడులప్రాయం
బొదవిన యాదేవసోముఁ డొయ్యనఁదా న
ప్పదునాఱుకళలనీను కు
ముదబాంధవుఁవలె వృద్ధిఁబొంది రహించెన్. 24

క. విధికృత మనివార్యం బా
విధియైనను దాఁటఁగలఁడె విధినిర్ణయముల్
విధిగతి నపదివ్యాధి
వ్యథితతనుండై సుతుఁడు దివంగతుఁ డయ్యెన్. 26

మ. పరలోకంబున కేగినట్టి సుతునిన్, భద్రాత్మునిన్, సద్గుణా
భరణుల్, సుందరగాత్రునిన్, సునిశితప్రజ్ఞావిశేషోజ్వలుల్
ధరణీదేవుఁడు ముందుపెట్టుకొని నానాభంగు లగ్గించి దు
ర్భరదుఃఖంబున వెక్కివెక్కి యవు డేడ్వంజొచ్చె నొక్కుమ్మడిక్.

గీ. పుత్రుఁ గౌఁగిలించుకొని యాముసలితల్లి
తలఁచుకొని తలఁచుకొని చేత లవియెల్ల
కొట్టి! కన్నీరు మున్నీరుగాఁగ నేడ్చె
కడుపుపొక్కంతయని చెప్పఁగాఁదరంబె? 27

ఉ. జాయయు భర్తయున్ సుతునిశైశవచేష్టల నెంచియెంచి పు
త్రా! యని వంశవర్ధనకరా! యని పాపముహాలతాలవి
త్రా! యని మాకు దారి యెదిరా! యని రా! యని సర్వలోకమి
త్రా! యని రాల్కరంగ నవురా! యని యేడ్చిరి హోరుహోరునన్

కం. ఆర్చెడు తలిదండ్రుల నో
దార్చుచునున్నట్టి జనులు దద్దరఁగి పె
ల్లార్చి రిఁకఁ బరస్పర మో
దార్చుకొనఁగవలసె వారె తప్పనిసరిగాన్. 29

కం. శవదహనంబునకది తగు
నవకాశము కాకయున్న నడ లుడుపంగా
శవము శ్మశానముఁజేర్చిన
భువిదివిజుం డేడ్పు మానఁబూనం డయ్యెన్. 30

కం. భూవరుఁ డది విని లక్ష్మణ
దేవుఁడుఁ దను వెంబడింపఁ దెగివచ్చి శ్మశా
నావనికి విప్రున కనెఁ "బ
రావరవిదు లీరె యేడ్తురా! యీరీతిన్. 31

మ. కనభూదేవవరేణ్య! నీవె యిటు దుఃఖంబందఁగాఁ జెల్లునే
తనయుం డెవ్వఁడు, తండ్రియెవ్వఁడు, తనూధర్మంబు లెబ్బంగులో
వినవో, చూడవొ, ధైర్య మాపదతతిన్ వేత్రోతురే? యిట్లునూ
తనమాంద్యంబు స్వకార్యసంగతుల నాత్మన్ బూనఁగా నర్హమే?

మ. అగుపించున్ బహుసౌఖ్యదాయకములై యానందముం గూర్చుచే
తిగ సర్వంబును మిథ్యయై తుదకు భీతింగూడఁ గల్పించెడున్
మృగతృష్ణల్ వలె, గాలిగోపురముల, ల్లెంతేని గాంధర్వికా
నగరంబుల్ వలె నాశఁగూర్చునుగదన్నా! వ్యర్థసంసారముల్. 33

కం. జలబుద్బుద సంకాశం
బులు తనువులు మెఱపుగములవోలెన్ విభవం
బు లనిత్యంబు లటంచుం
దెలియవె యిటు లడలఁదగునె ద్విజకులతిలకా! 34

ఉ. ఎద్ది తిరంబు లోకమున నెందఱు పుట్టిరొ యెంద ఱీల్గిరో
హద్దును బద్దునుంగలదె యంతకరుండును నిల్చియుండెనే
యిద్దనుకన్ బ్రయోజన మొకింతయు లేదని నమ్ము మద్దిరా!
యద్దములోని నీడలకు నాసపడం దగునయ్య విప్రుఁడా! 35

ఉ. చచ్చుట పుట్టుచుంట మఱిఁ జచ్చుట యిట్లె యుగాదినుండియున్
వచ్చుచునుండెఁగాని యిది వచ్చెనె క్రొత్తగ నీకు మాత్రమే
సచ్చరితా! లయంబు సహజంబగుఁ బ్రాణికి నింతలేడ్తురే
చచ్చిన పీన్గుకోస మిఁకఁ జావఁగనుండిన పీన్గు లక్కటా! 36

ఉ. కంచము చెంతఁ బిల్లి వలెఁ గాచి చెలంగుచు మృత్యు వెప్పుడుఁ
వంచనఁ జేసి పట్టుకొనుఁ బ్రాణినిఁ గాలము దానికిఁ సమీ
పించినతోడ మాయ కని పెట్టఁగనీయదు దాని జీవి ని
ర్వంచితుఁ డేనటంచు గరువంబునఁ ద్రిమ్మరుఁగాదె మూర్ఖతన్.

కం. చేటం బడినది మొదలుగఁ
గాటంబడుదాఁక దుఃఖకాండం బిలలో
గాటంబగుఁ బ్రతిజీవికి
దాఁటంగలవాఁ డెవండు దానిని విప్రా ! 38

గీ. చచ్చిన సుతుండు మరలి తా వచ్చునొక్కొ—
యెంతకాలంబు నీవిట్టు లేడ్చుచున్న
కటకటా ! వట్టి గొడ్డు తాకట్టుకాక
కాకదంతపరీక్ష లీ పోకలెల్ల. 39

గీ. దేహసంబంధ మొదాఁకఁ దేజరిల్లు
నంతదాఁకను జీవి యయ్యవసి నుండు
నది నశింప నప్పుడ పోవు నభ్రమునకు
నరయ జలతుంబికాన్యాయ మనఁగ వినవె ? 40

ఉ. నాదిది నే గడించితిని నా మడిమాన్యము లివ్వి యిద్దియో
నాదు లతాంగి నాసుతుఁడు నాసుత యంచు నహంకరింతు వీ
నాదికి నాదియేదో జననంబులునుఁ మరణంబులెన్ని యో
పాదితమయ్యె నెన్ని యుఁకఁ బొల్పుఁడు నీ వెనకో మెఱుంగుమా!

గీ. కర్మసూత్రంబుచే గట్టిగా బిగించి
మనుజులను తోలుబొమ్మల మాయముంచి
ప్రతిభ మెఱయ భువననాట్యరంగమున వి
రించియను సూత్రధారుఁ డాడించుచుండు. 42

గీ. కర్మమను బంకమట్టిని గలయఁగలిపి
జీవులను ఘటంబులను విచిత్రభంగి
సృష్టియను పేరిసారెపైఁ జేయుచుండు
నలువయను కులాలుండు నేర్పొలయునట్లు. 43

ఉ. కుమ్మరి మట్టి సారె నొనఁగూర్చెడునప్పుడుకొన్ని, యంత రూ
పమ్ము ఘటిల్లఁగొన్ని, కడుభద్రము చేసెడువట్లఁగొన్ని, తా
నమ్మెడు వేళఁగొన్ని, కొనునాతనిచేత నెకొన్ని, పోవు నిం
కెమ్మెయినో ఘటంబు లిటులేకద! జీవుల జీవితస్థితుల్. 44

గీ. ఎప్పు డేజీవి పుట్టి తా నెట్లు పెరిఁగి
యెప్పుడెప్పు డేరీతిగా నెటఁగలియునో
యెవనికెఱుక ? యెఱుఁగవే ద్విజేంద్ర! యడవి
యుసిరికయును సముద్రంపు టుప్పవంగ. 45

గీ. వివిధవనములఁ గాష్ఠముల్ వెడలివచ్చి
కలసి వెల్లువ నొకక్షణకాలమందె
విడువిధంబుగ సంసారవీచికాళిఁ
గలసివిడిపోవు నీపాడుకట్టె లకట ! 46

చ. అసదృశగాన నిర్ఝరులయం దనిశమ్ము మునింగి యప్సరో
బిసరుహగంధులన్ దఱుముబిత్తరి మొత్తపు టూడిగమ్ము చే
నెసఁగి త్రిలోకపూజ్యులయి యేనుఁగుకొమ్ములు రాజభోగముల్
మెసవునృపాలచంద్రులును మృత్యుముఖంబును దాఁటఁగల్గిరే? 47

ఉ. భంగమునొంది ప్రాణములఁబాయఁగఁగాల్పఁబడంగ లేదె సా
రంగమదార్ద్రసర్వరసరంజనకుంకుమ చంద్రసారది
గ్ధాంగులు, నూత్నరత్నఖచితాద్భుత సౌధతలాంతరఖ
ట్వాంగవికీర్యమాణకుసుమైకశయానులునైన భూభుజుల్. 48

ఉ. భంగమునొంది ప్రాణములఁబాయఁగఁ గాల్పఁబడంగ లేదె యు
త్తుంగయశస్సమాశ్రిత చతుస్సలిలాశ్రయముద్రితక్షమా
రంగదశేష రాజ్యపరిరక్షణదక్షమహీధ్రమానమా
తంగవిశాలహస్తసముదారలసద్భుజభూభుజోత్తముల్. 49

గీ. అట్టివారును శుచిదగ్ధులగుట లేదె?
వారి యవశిష్టకీకసవ్రాతములను
పొంచి జంబుకతతి మెసవుటయు లేదె?
కలదె! కాలాంతకవశంబుకాని ప్రాణి. 50

చ. నెఱియగురక్తసంచయము నీరుగ మారఁగ లోనిహంసయున్
దూఱఁగినతోడఁ జీమలకుఁదోడయి దుర్భరపూతిగంధసం
భరిత, మసహ్య, మాస్రవవివర్ధనబీజ, మదభ్రభీష్మమై
పురుగులుపుచ్చుకాయమున మోహముఁబూనఁగనౌనె? ప్రాజ్ఞుడా!

కం. కాలమునఁ బుట్టు జంతువు
కాలంబునఁ గ్రాలుచుండుఁ గాలము కతనన్
గాలంబు చేయుచుండును
కాలంబును గాలుఁడైనఁ గాదనఁగలఁడే? 52

ఉ. కంపను బడ్డకాకివలెఁ 'గా' యని యార్చెదవేర! మోహపుం
దుంపను ద్రుంచి దుఃఖమును దూల్పకయుందువయేని విప్ర! నీ
కొంపను నీవె కూల్చుకొనఁ గోరుటకాదె! యెఱింగి ముక్తికిం
బెంపు ఘటించు నీశ్వరునిపెంపు దలంచి భజింపు మింపుగన్. 53

గీ. చటుల మోహప్రబద్ధ మీజగము గాన
జ్ఞాని సద్యోవిచారంబుఁ బూని యాత్మ
ణామె విడుచు నదేపనిగ నజ్ఞాని వగచు
నింతియే జ్ఞాని కజ్ఞాని కంతరంబు." 54

మ. ఉపదిష్టుండయి యబ్బురంబెరుఁగ నోహోయంచు విప్రుండు త
ద్విపుల ప్రజ్ఞుని, రామభూవిభుని, హృద్వీథిన్ విలోకించి జ్ఞా
న పథంబూని పరాత్పరా! హరి! యనంతా! భక్తకల్పద్రుమా!
కృపఁ జూపంగదెయంచు హస్తయుగముల్ గీలించె బాదద్వయిన్.

కం. సాష్టాంగనమస్కారం
బిష్టపురస్సర మొనర్చి యీదృశకష్టా
విష్టజనాభయదాన ని
విష్టమతి వసిష్ఠశిష్యు వినుతియొనర్చెన్. 56

శా. అజ్ఞానాంధతమస్సమూహములు ఫుల్లాంభోజనేత్రా! భవ
ద్విజ్ఞానాగుణదీధితిచ్ఛటలచే విచ్ఛిన్నమైపోయెఁ ద
త్త్వజ్ఞుల్ గూడఁ ద్వదీయతత్త్వమహిమన్ భావింపలేరన్న న
ప్రాజ్ఞుండన్ భవవార్ధిమగ్నుఁడను నే భావింపఁగానేర్తునే? 57

మ. దొనలోనించిన శీతలాంబుకణసందోహంబుచందంబునన్
ననలోఁబైకొని జాలువాఱుమకరందవ్రాతమ ట్లింతయున్
బ్రణుతింబొందు త్వదీయవాగమృతధారల్ రామ! నాచిత్తమం
దు సదంబై ప్రవహించి శాంతిపఱచెన్ దుఃఖాగ్నికీలావలిన్.

మ. మనుజాధీశశిరస్స్ఫురన్మకుటసమ్యఙ్నార్హమాణిక్యకాం
తిని కాయంబు త్వదీయపాదములకున్ నీరాజనంబెత్తఁగా
మనుజాధీశకులాగ్రగణ్యుఁడవునై మజ్జారె! దీపింతు వో
దిననాథాన్వయదీపకా! నిఖలదైతేయార్తి సంధాయకా! 59

శా. రామా! సత్యపరాక్రమా! సురనుతా! రాజీవచక్షుర్ద్వయా!
కామాంధామర విద్విషత్ప్రకరదుర్గర్వాపహారక్రమా!
శ్యామామానసహారిమోహాన! ఘనశ్యామాభిరామాంగ! సం
గ్రామోద్భూత కిణాంకసవ్యకరవిభ్రాజద్ధనుశ్శోభితా! 60

చ. భువిసుతఁ బెండ్లియాడి, యహిభూషణు వింటినిఁ ద్రుంచి, కానలన్
దవిలి చరించి, రాళ్ళభయదంబగు సింధువుఁ గట్టి, ముక్కునుం
జెవులను గోసి, శూర్పణఖ చేతను బెట్టి, కబంధుఁ ద్రుంచి, శా
త్రవపలలమ్ముఁ జిమ్మి; ఖలు రావణుఁ ద్రుంచి, ప్రశాంతి గొల్పితో
నవరసధామ! రామ! నిను నాతరమా! నుతియింప మాటలన్.

కం. ప్రకృతిజితులె కాని జిత
ప్రకృతులు జగమందుఁ గానఁబడ రెయ్యెడలన్
సుకృతాత్ముఁడ! నీయుపదే
శ కృతిపటుత్వమున మోహసాగర మింకెన్. 62

మ. దురహంకారవిమూఢ చిత్తులగుచున్ దుఃఖాబ్ధినిర్మగ్నులై
దురుగాదే ప్రజలెల్ల సత్యమునకున్ దూరస్థమైనట్టి దు
స్తరసంసారము నమ్మి యుష్మదుపదేశస్ఫూర్తి మే లొందకుం
దురె? మోక్షప్రతిరోధిమోహమును గండూషించితిన్ రాఘవా!

కం. జ్ఞానోపదిష్టుఁడైన కు
మానిర్జరుఁ డంతట స్థిరమానసుఁడగుచున్
దా నిలుసేరెన్ హితసం
తానముతో, బంధుజనవితానముతోడన్. 64

గీ. కాష్ఠమును బేర్చి కడకమ్మెఁ గట్లనూడ్చి
పదిలముగ బాలు నచ్చితిపై నమర్చి
వేగునందాఁక కష్టంపు వేఁగుతోడ
కుణపవాహకుల్ నిలిచి రక్కుజమునీడ. 65

గీ. ప్రాకృతనరుండునుం బోలె వాలఖిల్య
ఋషివరేణ్యులార! యింక నేనేమిచెప్ప
జానకీపతి లక్ష్మణసహితుఁడగుచు
నిజనికేతనమును జొచ్చి నిద్రఁ జెందె. 66

ఉ. కీకసఖండమండలవికీర్ణవిశంకట శార్కరంబు, సా
లూకసృగాలనిస్వన విలోడిత కర్ణయుగంబు, గంటకా
నీకసమన్వితంబు, శవసిగ్గళితాంబరవిస్తృతంబు, వా
ల్మీకపిశాచరాక్షససమేత భయంకర రుద్రభూస్థలిన్. 67

చ. జరసనిపీడనోజ్ఝితుఁడు జర్జరితావయవుండు గాఢక
ర్కశుఁడు క్షణప్రభాద్యుతి సమాన పిశంగ జటానిబద్ధుఁడున్
హఠముఖయోగసిద్ధుఁడు పురారిసమచ్ఛవి తత్పితృక్షితిన్
మఠమునొకండు గట్టుకొని నైష్ఠికవృత్తి వసించు నిచ్చలున్. 63

మ. శఠుఁడున్ ధూర్తుఁడు నాతతాయి వ్రతనిష్ఠాశ్రేష్ఠుఁడై యొప్పియున్
గతనాత్ముం డతిగర్వి ధ్యానమును యోగంబాకళింతయ్యునుఁ
హఠ మొప్పన్ గురుధిక్కృతిన్ సలుపు దుష్టాత్ముండు తచ్ఛిష్యుఁడో
చు 'తలాయించి' గురూక్తకార్యముల నేఁచున్ వాని నెవ్వేళలన్.

కం. గురువే తల్లియుఁదండ్రియు
గురువే పరదైవమంచు గురుతరభక్తిన్
నెఱపని దౌర్భాగ్యుఁడు భా
స్వరవిద్యార్హుండో యైన ఫలభాజనుఁడో! 70

గీ. ధ్యాననిష్ఠాగరిష్ఠాత్ముఁడైన మౌని
కనుదెఱచి రుద్రభూమిలోఁ గలకలంబు
వినుచు నోశిష్య! కాటికి వేగపోయి
కాంచిరమ్ము కోలాహల కారణంబు. 71

కం. అని యాజ్ఞాపించిన య
మ్మునిపలుకు విని కనులు నులుముకొనుచు విఱుచుం
గొనుచు నొడలి నిటునటు నా
యని విడుచుచు నావులింత యబ్బాయనుచున్. 72

ఉ. నేళయుఁ బాళలే దిపుడు వేగుసుబోవఁగలేదు నిద్రమం
దాలను పీడఁబోకెనకు సారసమిత్రుఁడుగూడ రక్తుఁడై
కేలటితాంగినిన్ విడడకే యికతెమ్మని ప్రత్యహంబు గ
గ్గోలు ఘటించుచు నాకు నెదుగుంబోదు గేదిన దిందుచేతనే. 73

ఉ. పోయినగాఢనిద్ర యికఁబోవనె పోయెను భోజనానకున్
బోయెనుప్రొద్దు కూకుదినిపోయెన నోగురువర్య! యూరవం
జేమొడనుండిరూ తెలియ నేటికి లేపితివయ్య నన్ను ని
ద్రాయుతు భంగపుచ్చ, మరితెంబనవే మునిప్రముచ్చ! తొల్లిఁటన్.

ఉ. ఎంతకృశించియున్న నిఁక నెంతతపంబు జపంబు చేసినన్
నుంత గ్రహింపరే వారలచుమ్మలు శిష్యులకష్టనిష్ఠురం
బింతయుఁ జింతసేయ విప్రు డేగతి నాజఠరాగ్నియాఁప నో
కింతగఁ జల్దియున్నఖుడు వే యిడవే నమస్కైన వైతునే. 75

చ. మధువునుముట్టఁగూడదఁట, మాంసముమాటయెదోషమంట, యే
క్రుధయును బూనఁగూడదఁట, కోమలులన్ గనుమాత్ర నారక
వ్యధల మునింగి తేలునఁట, వాడఁగరాదఁట పుష్పమాలికల్
విధవల కంటెనుంజెడిరె వేయిమడుంగులు శిష్యధర్మముల్. 76

చ. పగలుపరుండనీయఁ, డొకపట్టున వాదనలందుఁ జిత్తమున్
దగులఁగనీఁడు, దంతముల ధావనచేయఁగనీఁడు తీవిగా,
మృగములఁజూచి భీతిగొననీయఁ, డిదేమి సుధర్మమో కనుం
దొగలకు నంజనంబయిన దోమఁగనీయఁ, డదేమికర్మమో. 77

చ. తల గమగంగనీయఁడు, మపంబు, ముదంబును బొందనీయఁ, డ
న్యుల నెఱసుల్ గణించుటకు నొల్లఁడు, నొల్లఁడు నృత్య, గీతముల్
వెలలగనీఁడు బండిపయి, వేఁడికిఁ దాల్పఁగనీఁడు ఛత్రమున్,
లలితసుగంధవస్తువు లలందఁగనీయఁ, డదేమికర్మమో. 78

గీ. మోహ, లోభాలసంగతి మొదలె లేదు
ఆడఁగారాదు జూదంబు, వేఁడిసీళ్లు
వాడరాదు, తొడగరాదు పాదరక్ష
లెల్లశిష్యులధర్మంబు లివ్వియంట. 79

ఉ. కేకలువేయరాదు, విసిగింపఁగరా దతిభక్తిమన్న మో
వాకము మానగా దెనురువాదము లాడఁగరాదు దోసముల్
చేకొనరాదు హాస్యమును జేయఁగరా దిగిలింపరా దికే
సాకునసాఁకరాదు తెగసాఁగఁగ రాదఁట ఛాత్రులక్కటా! 80

కం. కాటికిఁ బొమ్మనుచును వా
చాటా! వద రేదవునన్ను సన్యాసికి నీ
కేటికి సుఖములు నీవే
కాటికిఁబోరాదె యనుచుఁగనలుచు వటుఁడున్. 81

కం. పలుకం బలుకఁగఁ బెలుచగఁ
బెలుచగ జిరునవ్వునవ్వి వే మునిపలికెన్
తెలియవు మంచియుఁ జెడ్డయు
పలుగుఁదనము దక్క నెట్లు బ్రదికెదు బిడ్డా! 82

కం. అమ్మనిన ధూర్తశిష్యా!
ధమ్మనఁగానేర వీఁక హాశావడి గన నం
తమ్మునులేదు నిదురమం
చమ్మనుపీడకయ యజతు చల్దియటంచున్. 83

గీ. పాటిమీఁది గంగమ్మకుఁ గూటిమీఁది
లోకమనునట్లు తెలవారఁబోకమున్నె
యన్న మో రామచంద్రాయటంచుఁ నీవు
కడుపు చేఁబట్టుకొనిపోదు దుడుకు గట్టి! 84

ఉ. నాకభవాభివందితుఁడ, నైష్ఠికుఁడన్, జపతత్పరుండ, ము
ల్లోకము లేఁచి, యొక్కగడెలోఁ బొడిసేయఁగలాఁడఁ దిక్కికా
యా! కళలాకళించి పరిహాసముచేసెదు నన్నె యిట్లు నీ
'వాకుపడా' యవాకులు చవాకులు ప్రేలఁగ న్యాయమాసురా! 85

కం. గుటగుటలు గురువుతోనా
కుటిలుఁడ యని గురుఁడు పలుకఁ గ్రూరనిశిత దృ
క్పటలమ్మున వానింగని
కటకటపడి కటములదురఁగా నిట్లనియెన్. 86

మ. చదువున్, సంధ్య, సుగోష్ఠియంచు, సతమున్ సాధించి బాధింతువే
కద నీతోఁబడఁజాలనింక నివిగో కౌపీనవస్త్రంబు లి
ల్లిదిగో దండము గక్షపాల యదిగో యీమూల నీకుండి య
ల్లదిగో నీబ్రుసి నీకునాకు ఋణ మయ్యా! తీరె నీనాటికిన్. 87

కం. అని ధూర్తాంతేవాసి క్రు
ధనుబూని కమండలువును దబ్బునఁ జేతం
గొని పడఁగొట్టి యవని ము
త్తునియలుసేయుచుఁ బలాయితుండయిపోయెన్. 88

గీ. పండితం మన్యుఁడగు శిష్యుదుండగీని
తనమునకు మది నగచి క్రోధనుఁడు గాక
యగ్ని సంస్కారయత్న నిమగ్నులైన
జనులకడ కరుదెంచె నచ్చ్యుని వరుండు. 89

చ. చితిపయినున్న బాలకునిఁ, జిన్నరిపొన్నరి మేని వానినిం
గతిపయకాలమేర్పడ నెగాదిగఁజూచి విషణ్ణుఁడై జరా
యతనిజగాత్రమందు, నజరాయత బాలకగాత్రమందు, వి
స్తృతమగురోఁత, ప్రీతి, జనియింప లతాగృహమొందు దప్పులన్.

మ. పదిలంబై కనుపట్టఁగా వికచపుష్పస్ఫారమాధ్వీచర
న్మదరోలంబకదంబ ఝంకరణసన్మాంగళ్యమై యొప్పు న
ప్పొదరింటన్ నిజదేహ మెంతొ పదిలంబుం జేసి గోప్యంబుగా
సొదపైఁ గాయములో నిజాత్మ నపుడే చొప్పింపఁగా నెంచుచున్.

చ. తన చరణాంగుళిప్రభృతి ద్వారదశాగ్రముదాఁక నొక్కొయా
ర్పున నిడి ప్రాణవాయువును బోరున నెల్వడి యామునింద్రముఁ డిం
పెనయఁగ బ్రహ్మరంధ్రగతి నిర్ధకిశోరశరీరమందుఁ జొ
చ్చినఁ జితి నక్కుమారకుఁడు చేరెడు కన్నులు విప్పళించుచున్.

మ. కదలెన్ మెల్లగ, నొత్తిగిల్లఁ దొడఁగెన్, గాత్రేతులాడించెఁ, దా
నిదురం జెందినవాఁడు లేచినగతిన్ లేచెన్, భయభ్రాంతులై
కదలం బాఱిరి కొందఱ, రోడిరి దిధక్షాదీక్షులౌ వారలున్
మది భీతిల్లకుడంచు నింటికరిగెన్ బాలుండు వ్యాలోలుఁడై. 93

కం. బంధులు జనకులు గని నర
కాంధువుఁబడి తిరిగివచ్చినట్టి సుతుని ము
త్సింధువులై యాత్మభుజా
బంధముల నొసఁగిరి స్నేహబంధురు లగుచున్. 94

కం. విప్రసుతుఁడను మిష మా
ని ప్రవరుండు సలిపె జననీజనకుల కెం
తే ప్రియసేవ లఘుదువడ
భూప్రజ లాజనకు లెంతపుణ్యాత్మకులో. 95

కం. ఒకమా రకారణంబుగ
సుకుమారుఁడు నవ్వుచుండు సాంపౌలయఁగ నిం
కొకమా రకారణంబుగ
సుకుమారకుఁ డేడ్చుచుండుఁ జోద్యముగాఁగన్. 96

చ. అకలుషచిత్తుడై జనకుఁ డాప్తులు భీతియుఁ జోద్యమంది తో
చక రఘురామభూవరుని సన్నిధికిం జని మ్రొక్కి ‘బాలకుం
డొకపరి నవ్వ నొక్కపరి నూరక యేడ్చు నదేమిచిత్రమో
సకలకళాప్రవీణ! గుణసాగర! కారణ మేమి తెల్పుమా! 97

ఉ. హానియిదేమొ రామ హృదయమ్ము లమోఘమయమ్మయ్యెనయ్య! సు
జ్ఞానవిశోధితాత్ముఁడవు కారణజన్ముఁడ వీవెఱుంగఁగా
లేనివి లేనివేయగు జలేజదళాయతచారునేత్ర!’ యం
చానరు లెల్లవేడఁ జిరుహాసమునర్చుచు రాముఁ డిట్లనన్. 98

ఉ. బాలుని లీలగాదు, ద్విజబాలకదేహమునన్ మహాతప
శ్శీలుఁడు మానిసింహుఁడు, ప్రసిద్ధుఁడు, పాశుపతవ్రతుండు, వి
ద్యాలలనాధినాథుఁడు, మహాత్ముఁడు, దాఁ బరకాయవిద్య న
ల్లోలతఁ జేరియుండె నవిలోలమనస్కతఁ బౌరసత్తముల్. 99

చ. ఘనతరభారవత్తా ముసలిగాత్రము పాతముచెంది యుష్ణ నూ
తన తను వచ్చినందులకుఁ దా నగుచుండు ననాదరమైన త
త్తను నెటులన్ ద్యజించితిఁ బదంపడి చేయఁగఁదగ్గదేది యిం
కని విలపించుచుండునన నావ్రజ లేగిరి విస్మితాత్ములై. 100

కం. దయ దైవారఁగ మువ్వురఁ
బ్రియశిష్యులఁ జేర్చి మౌని విస్ఫూర్జితమౌ
మయవిద్య మహావిద్యా
ప్రయోగమహిమాద్భుతములు వారికిఁ గఱపెన్. 101

చ. ఎముక నొకండు దెచ్చి తన కిచ్చిన మంత్రము నుచ్చరింప మాం
సమును, సమృద్ధరక్తమును, సంప్రభవించె ద్వితీయుఁ డాత్మమం
త్ర మహిమఁ జర్మలోమముల రాజిలఁజేసెఁ దృతీయుఁ డందచం
దములను, రూపరేఖలవిధాన మొనర్చె మహాద్భుతంబుగన్. 102

సీ. బాలతాపసి తత్ప్రభావంబు గాంచి
ప్రథిత నిజమంత్ర శక్తిచేఁ బ్రాణములను
బోసెఁ దచ్చిత్రమునకు నో పూజ్యులార!
అపల జరిగిన చిత్ర మేమనఁగ వచ్చు. 103

కం. తర్జించుచు భర్జించుచు
నర్జించుచు నద్దిఁ బోఁచువారల నెల్లన్
నిర్జించుచు మార్జించుచు
గర్జించుచు భయదసింహ గాత్రంబయ్యెన్. 104

కం. అగుటయు తడవుగ నపుడా
మృగరాజము హుంకరించి మీఁది కుఱుకుచున్
ముగురంతేవాసులతో
దిగమ్రింగుచు మానివరునిఁ దిరుగంబడుచున్. 105

కం. పలుగొమ్ములుగాఁగల మెగ
ములఁ, దుంతల, గిత్తల, బలు మొదవుల, వార్వం
బులఁ, దగరుల, నర్హోనుం
గులఁగొంగ గసిమెయిఁబట్టి గుటుకున మ్రింగున్. 106

శా. భల్లూకంబులఁ బట్టుచున్, వృకములన్ భంజించుచున్, భూరిశుం
భల్లీలన్ విదళించుచున్, ద్విరదకుంభ శ్రేణులన్, సస్యసం
పల్లాభాఢ్యవసుంధరాతలములన్, భగ్నంబుగావించుచున్
వల్లీవేల్లితకుంజపుంజ మహిజవ్రాతంబులన్ గూల్చుచున్. 107

మ. ప్రళయాభీల మహాగ్నికీలకరణిన్ వ్యాపించి పంచాస్య మి
మ్ములఁ గన్పట్టినవారి నెల్లఁ ద్రుటిలోఁ బోకార్పఁ బౌరాళి వ్యా
కులచిత్తంబులతోడఁ బాఱి యతిలోకున్ మేటిధానుష్కుఁ ద
జ్జలజాప్తాన్వయమౌళిమండను పదాబ్జాతంబులన్ వ్రాలుచున్. 108

శా. ఆలుఁబిడ్డల నాస్తిపాస్తులను, జూలాలన్ మఱేమున్ననా
పాశం బన్నిఁటి వీడి పాఱిరిసుమీ పౌరాళి రామావనీ
పాలా! నీయసమానపాలనకళాపాండిత్యముంజూపి యా
భీలాకారమృగేంద్ర కల్పితజగద్బీభత్సమున్ మాన్పుమా! 109

కం. అని ప్రార్థించిన విని య
య్యినకులతిలకుఁ డొకింత హృదయంబునఁ జిం
తనగావించి వినుండో
జనులారా! యని సరసవచనములఁ బలికెన్. 110

చ. మనుజుఁడు మంత్రతంత్రములమాత్రము నేర్చినఁజాలునొక్కొ య
య్యనుపమశక్తి, తత్త్వములు, సందలియుక్తులు, సంప్రదాయకం,
బనుభవ, మర్హకీర్తి, సమయంబును, దేశ, మెఱుంగడేని యే
ఘనతరవిద్యయేని సజగంబుగ వానికిఁగాలపాశమా. 111

ఉ. ఒక్కరుఁడస్థిఁదెచ్చె మరియొక్కఁడు మాంస మసృక్కుఁజేర్చె నిం
కొక్కఁడు చర్మలోమముల నొప్పిదవౌనటుగూర్చె నట్లు స
మ్యక్కృతమైనదానికి మహాముని పాశుపతవ్రతుండు పే
రుక్కునఁబోసెఁబ్రాణ మది యుగ్రమృగాధిపమయ్యె నయ్యెడన్.

గీ. మునికులేశ్వరుఁ డజ్ఞాతమూలశక్తి
చేతఁబ్రాణపూరణచేయ సింహమయ్యె
మిమ్ము నిప్డదె రక్షింతు సింగమ్ముఁగూల్చి
యనుచు భూపతి ధనుశాలయమ్ముఁజొచ్చె. 113

మ. గిరిక్రేపుల్వలెనొప్పు మూఁపులపయిం గీలించి సిగ్ఘాతపా
తరవాభీలనిశాతబాణగణయుక్తస్ఫారతూణీరముల్
గరవాలమ్ములు, ఖేటకమ్ము, లురుచక్ర, ప్రాస, శూలంబు, లు
ద్ధురశస్త్రాస్త్రములన్, ధరించి విలసద్దోర్వీర్యగర్వంబునన్. 114

కం. అని నెటుఁవోయి మఱెటువ
చ్చునొ యని దృఢకల్పితములు, సునిశితములు, సా
ధనములు, గొని గొనగొని మెయి
నినుపజిరాయి ధరియించి యేతెంచెఁ జోన్. 115

సీ. పూవుతోఁ బాటు నెత్తావి పోవుపోల్కి
మనుజుతోఁ బాటు నీడ సాఁగనవిధంబు
చంద్రుతోఁ బాటు చంద్రికసరణి రామ
చంద్రుతోఁ బాటు చనె లక్ష్మణేంద్రుఁ డపుడు. 116

ఉ. దండితవైరిమండలుఁ డుదారుఁడు ధీరుఁడు రామచంద్రుఁ డు
ద్దండభుజాప్రకాండబలదర్పితవిగ్రహుఁ డత్యుదగ్రకో
దండము దండఁబూని యమదండముఁ దాల్చిన దండధారియో
రెండవరుద్రుఁడో యనఁగ రెక్కొని గండుమృగంబుఁ దాఁకుచున్.

శా. ఆకర్ణాంతము విల్లుచేర్చి మునుపే జ్యావల్లి సారించుచో
లోకాలోకముఁ దాఁకి టంకృతులు త్రైలోక్యప్రదేశంబులన్
వ్యాకీర్ణంబులుకాన్ సుఘాఘుము భయభ్రాంతాత్మమయ్యెన్ దిశా
స్తోకానేకపరాజి మ్రొగ్గతిలె సింధువ్రాతముల్ ఘూర్ణిలెన్. 118

మ. హరి యత్యంత మహాంకరించుచుఁ గరాళాస్యంబు దీపింపఁ గే
సరముల్ నిక్కఁగ వాల మార్చి నయనప్రస్తస్ఫులింగంబుతో
ధరణీచక్రము మ్రింగనున్నదనఁగా దర్పించి నోర్విప్పి భీ
కరగర్జానినదంబుతో నుఱుకఁబో క్ష్మాధీశుపై నుగ్రతన్. 119

ఉ. అబ్బురమంది రాఘవుఁ డహంకృతి నమ్మఱి వోరి తాంకృతుల్
గుబ్బతిలంగ నేసె నతిలోకశరంబుల నొక్కటేనియున్
గుబ్బలిపట్టి గట్టమును గూల్పఁగఁజాల దదేమిచిత్రమో
యుబ్బుఁ దొరంగి తొట్రుపడి యూరకచూచు నృపాలుఁ డత్తఱిన్.

ఉ. శాంభవచాపముం దునిమె, జానకిఁ బెండలియాడె, యౌవనా
రంభమునందె, గాధిసుతుప్రాజ్యమఖంబును గాచె, దైత్యసం

రంభ మడంచె నొంచె బహురాజపురందర గర్వభంజనో
జ్జృంభబలాఢ్యు, భార్గవుని, నేసెఁ బరాక్రమశాలి, వాలినిన్. 121

కం. శతయోజన విస్తీర్ణుని
నతిగంభీరుని, విపులభయంకరుని, సరి
త్పతి, నతిధృతి, బంధించెన్
దితి సంతతిపొగ రడంచె ధీరతమెఱయన్. 122

గీ. రావణునిఁగూడఁ గూల్చిన రామచంద్రుఁ
డొక్కసింగముఁగూల్పఁగా నోపఁడయ్యె
నెంతబలవంతుఁ డెంతధీమంతుఁ డైన
నొక్కొకప్పుడు భంగపాటొందుఁగాదె? 123

ఉ. తోఁచియుఁదోఁపకట్టిమదిఁతో రఘురాముఁడు విల్లుడించి దృ
గ్రోచి నిగుడ్చి లక్ష్మణవరుం గని ప్రాజ్ఞుఁడ! క్రూరఘోరనా
రాచమొకండుఁగూడ మృగరాజము నొంపకపోయె నెన్నఁడేన్
జూచితె యిట్టివింత రిపుసూదనసాధన మొక్కవోయనే? 124

గీ. అనిన లక్ష్మణుఁ డపహాస మంకురింప
నఖిలభువన రక్షాదక్షమైన నీదు
శక్తియేడ యీక్షుద్రంపు జంతువేడ
చంపు శరభాస్త్రమును బ్రయోగింపుమనిన. 125

చ. అనుజునిమాట వీనుఁగవ నానినతోడన రామభూవిభుం
డనుపమమంత్రపూతశరభాస్త్రము గర్జితఘోరసింహాసం
హాననముపై నిగుడ్ప మృగ మార్చి భువింబడె నంత దాని యా
ననముననుండి వెల్వడిరి నల్వురుశిష్యులు నొక్కమౌనియున్. 126

మ. ముగురన్ శిష్యుల నొక్కమౌనినిఁగదా మున్యగ్రణీ! మ్రింగె నా
మృగరాజం బిదిమెంతవింత ముగు రేరీతిన్ బళా! నల్వురై
రొగి దూర్వాసమునీంద్ర! తెల్పఁగదవే యుష్పాంగెడున్ మానసా
పగ యం చయ్యెడ వాలఖిల్యులడుగన్ బ్రహ్మర్షి హర్షించుచున్.

చ. పురజనులెల్ల వింతపడి భూవరు రాముని దానికారణం
బరయఁగ వారికిం బ్రమదమారఁగ నాతఁ డొసంగినట్టి యు
త్తరమును నేనునున్ వినినదాని వచించెద వాలఖిల్యులా
ర! ఋషివరేణ్యులార! యని రాణ దలిర్పఁగ నాతఁడిట్లనెన్. 128

మ. గురుధిక్కార మొనర్చి పోవ నెటకో కొన్నాళ్ళ కాశిష్యునిన్
బురవీధిం జెలరేఁగి సింహ మతనిన్ బూన్కిన్ వెసన్ బ్రింగఁ బోఁ
గరుణాసింధుని పక్షానిన త్రముని సాంగత్యంబు సంధిల్లె స్వః
పురిఁ జేరంజనినన్ విడాకులనగా ము న్విన్న సామ్యంబుగాన్. 129

గీ. గురుఁ డమాయికుండగు శిష్యు నరసి బిడ్డ!
గురుతిరస్కారకర్మానుసరణ ఫలము
సుమ్మ యిపుడె మాతోఁబాటు సురుఁగు శాప
మని వచించెదునంతలో ననఘులార! 130

గీ. రామబాణంబుదాఁకి హర్యక్షతనువు
నంతలో నది లోనున్న యైదుగురను
వెడలఁగ్రక్కుచు రాఘవా! విశ్వనాథ
అఖిలలోకైకరక్షకా! యనుచుఁబొగడి. 131

కం. దివ్యాస్త్రనిహతి సింహం
బవ్యవహితముగ స్వరూప మడఁగించుచు స
ద్దివ్యాకారముతోడన్
దివ్యాలంకారభరిత దేహముతోడన్. 132

కం. గంధర్వుండయి మునిజన
బంధు దయాసింధు నెదుట బద్ధాంజలియై
బంధురభక్తియుతుండయి
సంధితవినయమున రామచంద్రు నుతించెన్

# దండకము

శ్రీరామరామా! మహాబాహుభీమా! లసద్దివ్యనామా!
రసాజాతకామా! పరంధామ! నీనామసంకీర్తనల్ సేయఁ బాపౌఘ
ముల్ వాసి, నిష్ఠార్థముల్ గాయవే, వేగ నీసృష్టికిన్నీదు దృష్టిప్రసా
రంబె సారం, బసారంబు కన్మాయఁ గోరంబులౌ కార్యవారంబు
లన్నింటికింగూడ, నీమాన, భానం, దనూనంబుగా నెండఁగాపించి
కాపాంచి లోకంబులం బెంచి చంపద్గతింగూర్చు, నీ మాట నెప్పాట
పాటించి గాటంబుగాఁ జంద్రికల్ గాసి వాసిన్ వికాసించు రాకానిశా
నాథుఁ, డేవేళ నీపల్కు లాలించి లోకేశ నాకేశ శర్వేశ దేవాది
దేవుల్ మొదల్ చీమపర్యంతమున్ సర్వమున్ నిండి జీవంబుఁ గల్పించుఁ
దద్గంధవాహుండు, నీగీటులో నిల్చి విశ్రాంతియే లేక యశ్రాంత
మత్యంతమున్ వార్ధి ఘోషిల్లునో రామ! యాఘోష యేమందువో,
యిందుకుందాది సందోహసాదృశ్యకీర్తి ప్రభామూర్తివౌ నీమహావిక్ర
మోపేతగాథావితాన ప్రకారప్రపాఠంబె, ప్రత్యూషమున్ విచ్చు సూనాళి
కిన్ సంజ్ఞయేమన్న, నోయన్న, నీ నన్ను తాసన్న మాసృష్టి వైచిత్ర్య
మున్ గన్న యానందమున్ గన్న నన్ దెల్పు మన్నించుటే, యిట్టులెన్నంగ
నెన్నైనఁ జెన్నైన నీసృష్టిఁ గన్పట్టు వేయేల యాలించి లాలించి,
పాలించి భక్తాళికిం జాల తూలించి పాపంబుఁ, గీలించి పున్నెంబు, నీవేలు
దేవేళ నీవే మహాసృష్టియే నీవు నీలోన లోకంబులెల్లం బ్రకాశించు,
లోకంబులందెల్ల నీవుం బ్రకాశింతు, వాద్యంతముల్ నీవె, దిక్పాలకుల్
నీవె, బ్రహ్మాదులున్ నీవె, యాధారమాధేయమున్ నీవె, సంద్రంబు నీరంబు
లున్ నీవె, త్రేతాగ్నులున్ దేజమున్ నీవె, పుష్పంబు గంధంబునున్ నీవె,
వాక్యంబు నర్థంబునున్ నీవె, కాలంబు కార్యంబునున్ నీవె, యెవ్వారి
కెచ్చోట నెబ్భంగి నేమేమి భావ్యంబొ యవ్వారి కచ్చోట నబ్భంగి
నాయాయి కార్యంబు లవ్వారి నవ్వారి కర్మానుసారంబు సంధిం
తువో రామచంద్రా! దయాలోకసాంద్రా! లసద్భక్త జాలాను

గేయోపగీతావితానైకతంత్రా! భవద్రీతి నే రీతిఁ గీర్తింపఁగా నేర్తు నజ్ఞుండఁ గష్టుండ, శిష్టానులున్ భూరినిష్ఠాత్ములున్ బెక్కు మహిష్టిం పచ శ్రేష్ఠులుం గూడ, నీ జాడ, లేపోడిమిం జూడఁగా నోడి, వారోడి రో దేవదేవా! ప్రభూత ప్రభావా! నితాంతంబునుం బూని యంతఃక దిగంతంబులందున్ బరిభ్రాంతినొందన్ విలోకించి వేదంబులన్ దోఁచి, పాథోధియందేచి, లోకేశు బాధించుచోఁ జూచి, మత్స్యాకృతిం దోఁచి, యా పీచుఁన్ సోమకాభిఖ్యునిం ద్రుంచి, వేదంబు, లా వేధ కిప్పింపవే, పాలసంద్రంబు దైత్యామరులున్ దైత్యు లత్యుగ్రతన్ జిల్కనక్కాలమం దాదికూర్మంబవై, ప్రాదినీతుల్యవౌ పృష్ఠభాగంబునన్, మందరగ్రావమున్ దాల్చి రక్షింపవే, వారి మధ్యంబునన్ లీనమైయున్న భూచక్రమున్, యజ్ఞ ఘోణంబవై దంష్ట్రికాగ్రంబునన్ బూని పై కెత్తియున్ సత్తిపాత్తింపవే, బత్తికిన్ మూలమై కొయ్యలోఁ గూడ నీజాడఁ జూపించి లోకాలకున్ భీతిముం గల్పనం జేసి వాసించు ప్రహ్లాదు రక్షించి ధాత్రిన్ విజృంభించి త్రైవిష్టపస్త్రీల గాలించి, ముల్లోకముల్ పీల్చిపిప్పింబొనర్పంగ, నవ్వానితం ద్రుంచంగదున్ దీఁద్రమే పారఁగాఁబట్టి ప్రేవుల్ మెడం జుట్టి శ్రీనారసింహాకృతిం బొల్చి ధర్మంబు నిర్మించి భక్తాళిఁ బాలింపవే, వామనాకారముం బూని నాకావనీపాలకుం ద్రోలి పల్బాధలం బెట్టు వైరోచనుం గ్రిందికిం ద్రొక్కి పెంపెక్క క్రొవ్వాడిమిం బోడిమిన్ వాడికై నూడ్వవే, యంత ముయ్యేడుమారుల్ కఠోరోగ్రధారావిభాస్వత్కుఠారాగ్రభాగంబునన్ భూమిభాగంబునం గల్గు నాగాయుతోదార దోస్సారులౌ క్షత్రసందోహమున్ గూల్చి గర్వంబునన్ ద్రుల్పవే, భార్గవాభిఖ్య వంశంబునన్, రామనామంబునన్ గాక పక్షంబులూగాడు ప్రాయంబునన్ దైత్యులన్ గూల్చి గాధేయు జన్నంబుఁ గాపాడి ముక్కన్నుఁ జెవ్వారునుం ద్రుంపలేనట్టి విల్దుంచి సీతామహాదేవిఁ జేపట్టి ముల్లోకముల్ చుట్టి మాసింద్రులన్ గొట్టి, సస్యంబులన్ బట్టి, యజ్ఞంబులన్ మెట్టి, దేవాదులన్ దిట్టి, యన్యాంగనాలోకమున్ ముట్టి,

బల్ బల్మిమైఁబట్టి, లోకంబులట్టిట్టు తానట్టుగాఁజేయు స్వర్లోకవిద్రాణుం డైన తద్రావణుంబట్టి, చెండాడి రామావతారుండవై నాఁడవో రామ! నీదివ్యబాణాగ్రఘాతంబునన్ వేగ పంచత్వమున్ బొందఁ బంచానవత్వంబు నిర్మూలమైపోయి మద్దివ్యగాంధర్వరూపంబు సంధిల్లె నేన్ హేమచూడుండ నాజన్మ ధన్యత్వముంబొందె నజ్ఞానమున్ దూలె,సుజ్ఞాన దీపంబు హృద్ద్వీపమందుం బ్రకాశించు నేవేళ నీపాదపద్మంబులన్ నా శిరంబుంచి యర్చింతు, నీరూపలావణ్యముల్ గ్రోల నాకన్ను లర్పింతు, నానందసంధాయకంబైన నీ గాథ లానంగ నావీనులర్పింతు, నీపాద పద్మోద్భవంబైన విస్ఫారగంధంబునే, నాస నానాసకున్ వాసిగాఁబండు వుంగూర్తు, దాటోటుమాటల్ ప్రసంగింపకుండంగ నానోటికిం జెప్పు చున్ బుద్ధి నీపేటు, నీగోటు, నీ తేటు, నీమాట, నీయాట, ని పాటఁ, బాటింప శాసింతు నాజిహ్వ, కన్యంబు లల్పంబులుగ దుష్టముల్ కష్ట పాత్రమ్ములౌ వారి చారిత్రముల్ వ్రాయ కేనాఁడు నీచిత్రచారిత్రముల్ వ్రాయఁగా మీఁదుఁగట్టింతునాచేయి, గర్వంబుసర్వంబు నిర్మూలముం జేసి త్రైశుద్ధిగా నీదుధ్యానాబ్ధి స్నానంబు గావింతు నశ్రాంతమిన్నారు మున్నారు, నన్నారు పైనూరు నోరుల్ గలాఁడైన నీభూరిమాహాత్మ్య మగ్గింపగాలేఁడు శ్రీరామరామా! రిపువ్రాతభీమా! లసత్సద్గుణస్తోమ! మానీశ్వరోదార చిత్తాళిపాళీ విహారార్హ నీమా! నమస్తే నమస్తేనమః.

మ. పురిలోనంగల యెల్లపూరుషులు సమ్మోదాశ్రుధారావ్రజో
ద్ధురులై మ్రోసిరి దుందుభిధ్వనులు సాధ్వుల్ మెచ్చి సద్భక్తిఁగ
ప్పురపుం హారతు లిచ్చి రెల్లదివిజుల్ పూవుంజడిన్ నించి రొ
క్కరహిం బాడిరి రామచంద్రునికథల్ గంధర్వచూడామణుల్.

శ్రీ ర స్తు.

# ఆంధ్ర
# దూర్వాసరామాయణము

---

## పతివినిర్ణయగాథ

---

స్వామిన్యాంబు సరస్వతీ స్తవ మతిశ్రద్ధారతిన్ సల్పి సో
దాయత్తాత్మబిసప్రసూనుఁడయి సప్తాశ్వాన్వవాయాఖ్య వి
స్ఫాయోదారపయఃపయోధికుముదప్రాతాప్తుఁ డారాముఁ డా
త్మీయాత్యంతమనోజ్ఞసౌధమణి భూమీభాగభాస్వంతుఁడై. 1

కం. లలితపదములకు బలుపుం
జెలువుగులుకు వర్ణములకుఁ జిత్రకథామం
డలకథనాభిజ్ఞతకున్
నెలవయి విలసిల్లుచిలుక నెమ్మదిఁదలఁచెన్. 2

చ. కలిమి తృణమ్ముఁగాఁదలఁచి కాననసీమ దివమ్ముఁజేసి పెన్
జలనిధిఁ దేల్చి వట్టికతినమ్మగురాల విలోలమైన కో
తులచెలిమిన్ సురద్విషులఁదూల్చినవిష్ణ్వవతారమూర్తికిన్
దలఁపులు చిద్విలాసశేముదాయముగాక మఱేమి ప్రాఁతియే. 3

కం. తలఁచిన తలఁపున రివ్వునఁ
జిలుక రఘూద్వహపదసరసీజంబుల ప్రా
లి లలింజిలికిచిలికి తే
నె లొలుకు కులుకుంబలుకుల నేర్పునఁగొలిచెన్. 4

శా. వాగ్రీతిన్ శవణిల్లుకీరమును సంభావించి రాముఁడు స
మ్యగ్రాజీవసులోచనుండు గతినవ్యాపారపుం జేటికా
వ్యగ్రస్వాంతుఁడనై తి నే నిపు డయోధ్యాపట్టణప్రాంతభూ
మీగ్రామంబుల సంచరించి చిలుకా! మేల్వార్తలాలింపుమా! 5

చ. అలయికఁ దీర్పుమాయనుచు నర్కకులాభరణుండు సొంపుపెం
పొలయఁగఁ బల్కుపల్కులకు నుబ్బు సెలంగఁగ బిట్టు చట్టుపల్
లలితముగా విదిర్చి నృపులాలన నందినస్వీయజన్మపుం
గలిమికిఁ బారవశ్యజసుఖప్రదమీఁదుచు నేగె రివ్వునన్. 6

ఉ. ఆనగరాంతరాళమున హార్మ్యతలమ్ముల సౌధవీథులన్
సానువులన్ సభాస్థలుల సంజవనమ్ముల సద్మకోట్లఁ గ్రీ
డానిలయమ్ములన్ గడుబెడంగగునాలయసీమలన్ బ్రతో
ళీనికరమ్ములన్ మిగులుబేదనకుండఁ జరించె స్వేచ్ఛమై. 7

కం. గౌరీతీర్థవిరాజ
ద్గౌరీనిలయంబునందుఁ గల్యాణమహ
శ్రీ రాజిల్లుటఁగని చ
ళ్రూరాజీవయుగమునకు సూఁడిదఁబెట్టెన్. 8

శా. భాషామోషయుఁ దెల్లఁబోవు, మతివిభ్రాంతిన్ గురుండందుఁ, ద
చ్ఛేషుండున్ దలవంచుఁ, గుఱ్ఱఁదనమున్ సేనానియుంబూను, న
య్యాషాఢంబున శుక్లపక్షమునఁ బ్రత్యబ్దంబు వర్ధిల్లు త
త్త్రైషారాద్రికుమారికా మహముఁ జేతఃప్రీతి వర్ణించుచోన్. 9

సీ. అఖిల దేశాయాతయాత్రిగప్రతతిచే
నెడమింతయును లేక యొసఁగుచుండి
పురవాసపరవాస నరసంతతులచేత
గౌరీసమాఖ్యపుష్కరిణి నిండి

సరిగంగ తానముల్ సలుపు నాల్మగలచే
నలరారు దృశ్యసస్యములు పండి
ముకుమూనికొని యోగమునమున్గమునులచే
భక్తి యాకృతిఁదాల్చి ప్రజలుచుండి

సీ. సగమునగ మర్చఁజేసిన సతియు నల్లు
నని శివునిఁగూడ నర్చించి యలరునట్టి
చండభక్తమండలముచే నిండి లోచ
నోత్సవమొనర్చు గౌరీమహోత్సవంబు. 10

శా. సారక్షేత్రమునందుఁ గాలిడిన దుస్సంఘాళికిం గూడ వి
స్తారం బబ్బును భక్తియన్ననఁడికిం దారాఘ్రాణగాఁగీర మా
గౌరీతీర్థము మెట్టి క్రుంకులిడుచున్ గౌరీశునిన్ గౌరినిన్
భూరిధ్యానసమార్చనాదివిధులన్ బూజించె సద్భక్తిమై. 11

కం. పరమకథాసరణిఁ బరులఁ
బరవశులను జేయుశుకము పరవశమై తాఁ
బరమాద్భుతమగు చాకిత
చరితంబు నెఱింగి రామచంద్రు దరియుచున్. 12

మ. చలపక్షవ్యజనంబులన్ విసరుచున్ జంచూపుటానీతగం
ధిలపుష్పంబులఁ బూజచేసి స్థిరభక్తిన్ బక్షలోకాంతర
స్థలగుప్తంబగు గౌరితీర్థములచే స్నానంబుగావించి భా
సిలు శ్రీరామపదాంబుజంబులను బూజించెన్ విలాసక్రియన్. 13

కం. మనమును, వాక్కును, కాయం
బను వానికి, నందరాని యనఘునకు శుకం
బనుభూతకథోదంతం
బినవంశోత్తమునకు విన నిట్లునచించెన్. 14

ఉ. స్వైరవిహారమున్సలిపి సంతసమొప్ప నయోధ్యలోన నో
భూరమణాగ్రగణ్య! యొకపుణ్యతలమ్మున నద్భుతమ్మ దై
వారఁగ నొక్కచాకిత యపారపవిత్రచరిత్రవృత్తి మే
నారసి కన్నవిన్నకథయంతయుఁ జెప్పెద నానుపూర్విగన్. 15

శా. ఓరాజన్యవరేణ్య! త్వత్పురసమీపోర్విన్ బవిత్రాఢ్యమై
గౌరీపుష్కరిణీతటంబున మణీకాంతి ప్రకాండంబుచే
గౌరీమందిర మందచందములకుం గాణాచియై చాల నొ
ప్పారుం బౌఱులెకాక యెల్లతెగ లవ్వారిన్ రహింగొల్వఁగన్. 16

కం. ఉత్సవకాలంబగుట మ
హోత్సవదర్శన కుతూహలోన్నతులై సం
పత్సముపేతు లపేతులు
నుత్సాహముమీఱ వత్తు రొక్కుమ్మడిగన్. 17

చ. ధవళుఁడు, యౌవనుండు, గుణధన్యుఁడు, చాకి, గతాబ్దమందుఁ ద
త్ప్రవిమలగౌరితీర్థమునఁ దానము, దానవితానమూని, శా
స్త్రవిధుల నాచరించి, గిరిజన్ బహుభంగులఁ బూజచేసెఁ దా
నవిరళభక్తినుండరె? ధరాధిప! సజ్జను లన్నిజాతులన్. 18

కం. మఱియొకరజకుఁడు విమలుఁడు
సురకాంతను బోలుసుతను సుందరియను సుం
దరినిన్ వెంటంగొని పు
ష్కరిణి మునిఁగి గిరిజపూజసలుపఁగవచ్చెన్. 19

ఉ. సుందరిగ్రుంకి పుష్కరిణిఁ జొక్కపుమేల్జలతారుచీర మె
చ్చందగురీతిఁగట్టి యొకచక్కటియేమి ప్రతిప్రతీకమున్
జిందికడానివస్తువులనిగ్గులు మేనికిఁ దగ్గునూపఁ గ
మ్మందనమీని చేష్టగల మామిడిగున్న యనంగఁ బొల్చుచున్. 20

ఉ. సుందరహా స్తయుగ్మమున సొన్నప్రుఁబళ్ళెరమందుఁ దావులన్
జిందుసుమమ్ములున్ ఫలవిశేషము లక్కఱవచ్చు ద్రవ్యముల్
గ్రందుగఁగూర్చి యంచనడకన్ దలపించుచువచ్చి యంబికా
మందిరమందుఁ జొచ్చెనది మాయురె భక్తికి నాలపట్టనన్. 21

కం. గిరిజాపూజానంతర
మరుదెంచినదానిఁగాంచి యతిచకితుండై
మరుగజ్జలగుబ్బంబెడి
ధరణికి నెటువచ్చెననుచు ధవళుఁడు దలఁచెన్. 22

గీ. ఇది మదీయవాహనమని యెఱిఁగికూడఁ
గూడఁదలపోయునట్టి బల్ కూళయితఁడు
పట్టిపాలార్తునని చలపట్టినాఁడొ
యనఁ గురిసె శరములు మరుండతని మేన. 23

శా. శ్రోణీమండలియున్నతిన్ సాబఁగునన్ జోకైనదై శాల్యమున్
క్షోణీమండలిఁ గ్రేణిసేయు నవురా క్షోణీతలంబందు ని
ర్యేణీలోచనతోడి సాటిగలదే యొందైన నీసుందరిన్
రాణింగాఁ గొనువానికబ్బునుగదా! రాజ్యం బఖండంబుగన్. 24

ఉ. అందనిమ్రానిపండు విమలాఖ్యులిగాడిలిపట్టి నా కిఁకే
చందమునన్ లభింపనగు సారెకుసారెకుఁ బంచసాయకుం
డందరిముందు నాకు నకటా! నగుఁబాటు ఘటించుచుండె నే
మందును మందునుం గలదె యక్కట! మందున కెందుఁజూచినన్.

కం. అని వగలంబొగులుచు వ
చ్చినపనిమఱచి, తలముమఱచి, తుదకులోకం
బునుమఱచి, మఱచి తనతనువు,
నెటులో మందిరముఁజేర్చె భూపలలామా! 26

చ. పలికినపల్కునే మరలఁబల్కు యిదేమనిసిగ్గుఁ జెందుచున్
నిలిచినచోటనే మరలనిల్చి పనేమని సంశయించుచున్
దెలివిదొలంగి యాక్షణమె తెల్వి వహించియు నంత సుందరీ
లలన త్రిలోకసుందరి విలాసపుబొమ్మని నవ్వుఁబల్కునన్. 27

చ. తనయునినెంజలించెలిసి తల్లి తటాలునఁబోయి భర్తకున్
వినిచిన దాని నేగతినిఁబెండిలిచేయుదు నేన వేడఁ జు
ల్కనయగుఁగాదె నైనన గుఁగాయని తండ్రితలంచె నేడఁగన్
గానములబ్రోవులా సుతులకోర్కులు దీర్పరె తండ్రు లెచ్చటన్. 28

గీ. సుందరినిఁబెండ్లిచేయఁగా సుతునకతఁడు
విమలవిమల నికేతనవీధిఁజొచ్చి
సంశయాకులచిత్తుఁడై సంభ్రమించి
యెట్టకేలకు విమలునియింటి కేగి. 29

చ. విమలుఁడ! నీవు నిక్కముగఁ బేదకిమాత్రమెకాక సార్థకం
బమరిన స్వచ్ఛచిత్తము సమంచితవృత్తము గల్గువాఁడ వో
యమలుఁడ! నీయనుంగుసుతయైె తగుసుందరినిచ్చి పెండ్లి నా
కొమరునకుంబొనర్పు మొనగూడిన దీమనుజోడు చూడఁగన్. 30

కం. మంచిముహూర్తము విధి ని
ర్మించెనోయన రేపె కలదు మించిన నీఁక లే
దంచు వచింపఁగ విమలుఁడు
మంచిది కానిండటంచు మాట యొసంగెన్. 31

కం. అభినవసంభారంబులు
ప్రభవించినభంగి సిద్ధపడె నొకత్రుటిలో
శుభలగ్నమున ధవళుఁ డతి
విభవమెసఁగ సుందరి నట వివహంబయ్యెన్. 32

ఉ. పెండిలియై పదంపడి విభీతమృగేక్షణఁదోడుకొంచు ను
ద్దండమహోత్సవంబున స్వధామముఁ జేరఁగ నెల్లరున్ బళీ!
రెండవ మన్మథుండితఁడు రెండవదా రతియీమె మాకనుల్
పండిన విట్టులుండవలె భాగ్యమటంచు వచించి రెంతయున్. 33

గీ. వార లన్యోన్యమును ప్రేమబద్ధగాఢ
హర్ష సింధుమగ్నాత్ములై యఖిలభోగ
సంజనితఘనసౌఖ్యసంచయము నంది
యెల్లవేళలఁ గడుఁగృతకృత్యులైరి. 34

మహాస్రగ్ధర

ఈరీతిన్ స్వేచ్ఛమీఱన్ హితకరమగున స్త్రైకభావంబుతోడన్
గారామారంగ నిచ్చల్ కలసిమెలసి యాఖండలశ్రీల నీర
క్షీరన్యాయంబుభంగిన్ జెలఁగుచు సుగుణశ్రీవిరాజిల్లఁగా సం
సారంబీడంగ నేర్చెన్ సకలజనములజ్జారెయంచున్ నుతింపన్. 35

గీ. అంత ధవళునిస్వాలకుం డాత్మగృహము
నందు సలిపెడుశక్తిపూజార్థ మాత్మ
భగినిని మఱఁదినిబిలిచి భద్రభంగిఁ
దోడుకొనివచ్చె సరియైన తోయమునకు. 36

ఉ. బాలురఁ జేరువేళ, గురువర్యులఁ జేరెడువేళ, గర్భిణీ
స్త్రీలను, వృద్ధులన్, శుచిని, దేవునిఁ జేరెడువేళ, నప్సర
స్త్రీలను జేరువేళ, నృపతింగనువేళను, రిక్తహస్త సం
కీలితులై చనంగ నది కేవలశాస్త్రవిరుద్ధ మిద్ధరన్. 37

ఉ. ఆరహినాత్మనెంచి కుసుమావళులున్, ఫలసంచయంబులున్
సారెకుఁగూర్చి పళ్ళెమున స్వాలకునిం దనసోదరిన్ బహి
ర్ద్వారమునందునిల్పి మహిషాసురమర్దనికోవెలన్ జొరం
బాఱి యతండునొక్కరుఁడ భక్తి సమార్చనసల్పె శక్తికిన్. 38

శా. దుర్గాదేవికి నెందరోజనులు భక్తుల్ శక్తులేపారఁగా
నిర్గర్వంబున నిచ్చుచుండిరిగదా! నిర్వృత్తికై ప్రాణభృ
ద్వర్గంబుం బలిగాఁగ నాత్మబలి సద్భక్తిన్ సమర్పించి నేన్
స్వర్గాగారముఁ జూఱఁగొందు ననుచున్ జాంచల్యహీనాత్ముఁడై.

ఉ. అర్ఘ్యమునెట్టుటెట్టోడ గిరిజాలయసీమను దాంటికంటె వే
మర్ఘ్యలు మీఱి భక్తి యసిమ్మార్గణముంబొనరించి కాంచి యా
షడ్గుణమైన కోరిపులఁజంపి యొసంగుదుఁ బ్రాణమంచు వే
ఖడ్గము దూసి త్రెంచుకొనెఁగంఠము శక్తికి నప్పనంబుగన్. 40

ఉ. వేళ యతిక్రమించె పృథివీధరపుత్రిక పూజసేయఁగా
స్యాలకుఁజేగి రాఁడు కత మారయఁగానఁగరాదు ప్రేయసీ!
యాలయసీమఁజొచ్చి సుగుణాత్ముని శ్రీప్రియసోదరున్ క్షణం
బాలములేక తెత్తు నిలుమా యని యాధవళాక్షిఁ జేగుచున్. 41

కం. చచ్చినస్యాలకునింగని
యచ్చెరుపడి మోహపరివృతాత్ముండై తాఁ
గ్రచ్చఱ శితఖడ్గముచే
గ్రుచ్చుకొని శిరంబు నేలఁగూలంబడియెన్. 42

ఉ. చెల్లరె! వల్లభుండరిగె శీఘ్రమె సోదరుఁదోడితెత్తునం
చల్లదె ప్రొద్దువోయె హృదయం బది యేలొకొ తల్లడిల్లునం
చల్లలనాశిరోమణి భయంపడి చూచెదఁగాకయంచు న
ల్లల్లనఁబోయి వల్లభుని నాత్మసహోదరుఁగాన కచ్చటన్. 43

మ. బలిపీఠాగ్రమునుండి శోణితము కాల్వల్గట్టిపాఱన్ శిరం
బులు, మొండెంబులు, శాతఖడ్గము, లసృక్పూరంబునంజూచి త
ల్లలితంబౌతనువల్లి జల్లుమని పుల్కల్ పుట్టి కంపింపఁగా
లలనారత్నము మూర్ఛలోమునిఁగి నేలంగూలె దబ్బాటునన్. 44

గీ. శోకవిహ్వలితేక్షణ సుందరాంగి
యలఁతియలఁతికన్నీమరలల్ల నెత్తి
యంతకంత కభ్యుత్థాన మాచరించి
ప్రార్థన మొనర్చె నిబ్బంగి భక్తిమెఱయ. 45

ఉ. భర్తయుసోదరుం డెటులుప్రాణముఁబాసి రగమ్యగోచరం
బార్తిద మద్భుతంబును భయంకరమయ్యెడు భూరివేదనా
వర్తనిమగ్నురాల నిఁక బాయక నన్ దయఁజూడవమ్మ! యీ
భర్తృవిహీనజీవనము భారముగాదె త్రిలోకపాలనీ! 46

కం. అష్టాదశభుజములతో
దుష్టప్రాణాపహారధూర్వహవగుచున్
శిష్టావననిష్ఠామతి
విష్టపములఁబ్రోచుతల్లి! వీక్షించు దయన్. 47

సీ. అఖిలదైతేయ భయంకరీ! భక్తవ
శంకరీ! శాంకరీ! శరణు! శరణు!
వివిధపాపలతాలవిత్ర! శివకళత్ర
సకలసద్గుణపాత్ర! శరణు! శరణు!
బహుపరాక్రమయుక్త! పరివారసంసక్త!
శాంభవీమూర్తి యుక్త! శరణు! శరణు!
తుహినాద్రివాసినీ! మిహిరప్రకాశినీ!
సకలసతోష్వమణీ! శరణు! శరణు!

గీ. కలిత నిర్జరదైతేయ గరుడనాగ
యక్షగంధర్వ కిన్నరాధ్యక్షవర కి
రీట ఘటితరత్నాంకురకోటిరాజ
దరుణచరణారవింద! తే శరణు! శరణు! 48

చ. కనుఁగొనఁనట్టులుండియును గన్గొననేస్తు జగత్తులెల్లఁ జే
కొననటులుండి చేకొనుచుఁ గోర్కె లొసంగును భక్తకోటికిన్
గనుదెఱవంగ సృష్టియగుఁ గన్గవమూయ లయంబగున్ జగ
జ్జనని! దయాస్వరూపిణి! నిజంబగువార్తను దెల్పు తెల్పవేన్. 49

కం. కుతుకంబుప్పతిలంగ ని
శితఖడ్గముచేతఁబూని చెండి శిరము నే
నతిభక్తినిఁ బతిభక్తిని
నతిధృతి వెలయింతునను నసి జళిపింపన్. 50

శా. బాలా! సాహసమేల? మెచ్చితి భవద్భక్తిప్రభావంబు ము
త్కేలాలాలయవీచికానికరమగ్నీభూతమయ్యెన్ మనం
బేలా? బేల! కుశంక సోదరుఁడుఁ బ్రాణేశుండు నిద్రించు వా
రాలో మేల్కొనుభంగిఁ బొల్తురుసుమీ యత్యంతమోదంబునన్.

గీ. కార్యశకటంబునకును జక్రములు రెండు
పౌరుషము దైవమనునవి పరఁగుచుండు
నొంటిచక్రంబున నడచునొక్కొ బండి
కార్యసాధనమునకు నొక్కండు వినుము. 52

ఉ. ఖండితమస్తకంబులను గంజదళాయతచారునేత్ర! యీ
మొండెములందుఁ గూర్పుము ప్రమోదము మీఱఁగ నీసతీత్వ మొ
క్కండె పతిన్సహోదరునిఁగాచి నజీవులఁజేయునంచు న
చ్చండిక చండభక్తిజనసంచయమండితగాత్ర పల్కెనన్. 53

కం. అతిమోదాతిశయంబున
నతిరభసమెలర్పఁగ జలజానన యతికిం
చుతఱిఁదలలు తార్మార్పడె
నతిసర్వత్ర విడవలయునం టతిశయమే? 54

ఉ. అండజయానకే తచ్ఛిరము లాదట మొండెములందుఁగూర్చి యా
చండిక ఘోరతుండికను సంస్తుతిసేయుచునుండ వారునో

శ్చండిమ మొప్పనిల్చి రనుజన్ముముఖంబును భర్తమొండెమున్
వెండియు భర్తృవక్త్రమును బ్రీలినసోదరుగాత్ర మొప్పఁగన్. 55

కం. ఇర్వారవ్యత్యస్తతగని
నిర్విణ్ణయగుచు నిలువునసీతై నిలువన్
దుర్వారతరంబగుఖే
దార్వాగ్నిఁ దపించుచున్న యామెం గనుచున్. 56

కం. ఉర్వీధరపుత్రిక యనెఁ
జార్వంగీ! పతిఁగుఱిఁచి విచారింపకుమీ
యుర్వీశుఁడు శ్రీరాముఁడు
సర్వజ్ఞుఁడు మఱచ్చి నీదుసందేహంబున్. 57

కం. మిహికాంశుముఖి! నాపతి
తుహినాద్రి నిలిచి రఘుకుల ధూర్వహు చరితం
బహరహముఁ బఠించెడు నది
బహుళశ్రేయస్కర మతిపాపహరమగున్. 58

కం. అదియుంగాక లతాంగీ!
మదిలో శివునంతవాఁడు మానక శ్రీరా
ము దయాధాము జపించెడు
నదిరా! యని ప్రమథులెల్ల రబ్బురమందన్. 59

కం. రామాజ్ఞ నీవు తప్పక
యామోదింపు మది కూర్చు నామోదం బో
రామా! యని శివ పనుపఁగ
రామామణి సమ్మతించి రామనృపాలా! 60

కం. ఈపై పువచ్చుచున్నది
దేవా! తనసందియంబుఁ దీర్చుకొన భవత్
పావనపాదాంభోరుహ
సేవాయత్తాత్మయగుచుఁ జిడిముడిపడుచున్. 61

మ. అనుచుంబల్కెడు పల్కులో సతి విచారాక్రాంతయై వచ్చి ము
న్మను గావించి నమస్సు నాత్మచరితంబున్ సర్వమున్‌విన్చి యో
యినవంశాగ్రణి! ధర్మశంకమెయి నే నిప్డెత్తి నీయాజ్ఞ దే
వనికాయంబులుఁదాల్తు రౌఁదలల దేవా! తీర్పు నిప్పింపనే. 62

కం. అన విని బాలికదుర్దశ
గని నిర్విణ్ణుఁడగుచు ఖరకరకులమణి సే
కొని మునిసింహుని భావం
బును ధర్మవినిర్ణయ మిటు పొలిచిచేసెన్. 63

గీ. హావభావానుకూలత్వ మమరియుంట
దానికి శిరస్సనెడి సంజ్ఞ తథ్యమయ్యె
పతిశిరముచేత నేగాత్ర మతిశయిల్లు
నదియె పతియగు నిశ్శంశయంబు సుమ్మి. 64

కం. జ్ఞానేంద్రియయుతము, బల
స్థానంబును, సూక్ష్మమతి నిధానంబగుచున్
మానుగ సర్వేంద్రియముల
లోనఁ, దల ప్రధానమనుటలో నబ్బురమే! 65

కం. సకలవిధసుఖాభివ్యం
జకము శిర మది గలవాఁడె చానా! పతియా
నిఁక సందియమువలదు పొ
మ్మకలుషచిత్తుండు నీకు నతఁడే మగఁడౌ. 66

గీ. ఘనులుమునులు సాక్షీభూతు లనుటమీఁతె
నవనినాథుఁడు సీతాగృహంబుఁజేరె
వరశుకమ్ము గాంగేయపంజరముఁ దూఱె
నిసియనులతాంగి శాంతిమై నిద్రఁగూరె. 67

శ్రీ ర స్తు.

# ఆంధ్ర

# దూర్వాసరామాయణము

## మదనసేనగాథ

శ్రీగంధర్వసుపర్వయక్షఫణభృత్సిద్ధాప్సరోభామినీ
వాగాకీర్తితసత్యవిక్రముఁడు భాస్వద్వంశదీపాయితుం
డాగోపాయితమేదినీతలుఁడు సీతాబ్జాస్యతోఁగూడి శ
య్యాగారంబున ద్యూతఖేలనకళావ్యాలోలుఁడై యుండఁగన్. 1

ఉ. రాజకులాభిరాముని, బరాజితసోమునిఁ, గీర్తికామునిన్
తేజితమార్గణప్రకరధిక్కృతభీముని, రామునిన్, బత
త్రాజము చేరవచ్చె ననురాగపుఁ బెంపెసలార నెయ్యపుం
జూజము మాని కీరమును జూచి రఘూత్తముఁడొత్తి యిట్లనున్. 2

కం. తలఁగింపనేర్తు వెట్టి త
గులములనైన భవదీయగూఢార్థకథా
కలనమునఁ బలుకుకలుముల
పులుఁగా! నీపొట్ట కతలపుట్టగుఁగాదే! 3

గీ. రాజకీర మారాజకీరంబుతలఁపు
తలఁపులోననె తెలిసి యంజలిఘటించి
'శ్రూయతాం రాఘవా' యటంచును కథించె
నధికసంతోషవర్ధనం బయినగాథ. 4

ఉ. మానితసర్వసంపదల మాదిరినాఁదగి మేటియౌ నయో
ధ్యానగరంబునం గలఁ డనంతధనాంచితుఁ డర్థదత్తుఁడ
న్యూనవణిక్కులాంబునిధి నూత్నసుధాంశుఁడు విప్రదైవత
ధ్యానపరాయణుండు వినయాదిమహాగుణధన్యుఁడెంతయున్. 5

కం. ధనదత్తుండను తనయుఁడు
వనితామణి మదనసేన వనరాశికిఁ బా
వనులగు చంద్రుఁడును రమా
వనితవలెఁ గలిగిరి సార్థవాహుని కెలమిన్. 6

చ. వదనమునన్ సుధాంశుఁడెల వాయువు లూర్పులఁ, గేశపాశి ష
ట్పదములు, చిల్కముల్కు, లెలపల్కులఁ, గోయిల, కంఠసీమ, న
మ్మదనుని సేన యిప్పగిది మానినియంగకముల్ భజింప న
మ్మదితసమాఖ్య సార్థమయిపొల్చె జగంబుల నద్భుతంబుగన్. 7

ఉ. భావకవిత్వముంబలె నభావముదల్లలితాంగికొను సం
భావితసత్ప్రబంధగతి బంధురవర్ణన కాలయమ్ము న
ర్వావయవప్రకాండ ముదయావసరాచ్ఛసుమాళిభంగి స్వ
చ్ఛావరణంబు మానస మయారె యొయారికి సాటియున్నదే. 8

కం. నిర్మించె నర్థదత్తుం
డర్మిలి నారామ మొక్క డందు సుధారో
చిర్మర్మరిహర్మ్యము న
త్కర్మఠుఁడు విహారకౌతుకమ్మున పేర్మిన్. 9

చ. లలితవనాంతరోర్విఁ నకలంకజలంబులనొప్పు నొక్క మే
ల్కొలను ఘటించి తత్పృథులకూలమునన్ ఖచియించెఁగుట్టిమం
బులఁబలువన్నె తీవియలు, పూవులు, కాయలు, సాజమవ్వియం
చెలయరె భంగపాటు కనునెంతటి నేర్పరులైన వారలున్. 10

చ. బలితపురాగసంపదల భాసిలుపల్లవకోటిఁ బోల్చుచున్
బలురకమైనపూలు దలభాగమునన్ ధరియించి ఘుంఘుమా
వళులు సెలంగఁగా పయిసాబంగుల నవ్వనకాంతయున్ గడిం
చు లలనపోల్కిఁ జూపఱ మనోధనమున్ హరియింపఁజొచ్చెడిన్.

మ. ఒకనాఁ డాధనదత్తు చెల్లియలుఁదా నుద్యానదేశంబునం
దకుతోభీత, సఖీసమేత, సువిహారాసక్తిమైఁదీగడో
లికలందూఁగుచునుండఁ బెంపొలయు బాళిన్, ధర్మదత్తుండు నా
సుకుమారుండు వణిక్కుమారుఁడు లసత్ శుద్ధాత్ముకుండయ్యెడన్.

కం. పోవుచు నయ్యుద్యానము
క్రేవం దానును విహారకేళిపరుఁడు సం
ధ్యావసరంబున మెఱపుం
దీవె మదనసేనఁ దేపతేపకుఁ జూచెన్. 13

ఉ. తూఁగుదు రే సమానముగ దోయ్యవనజాయతనేత్రలార! నా
తో గమకమ్మునందనుచుఁ దోరపుఁ బంతములాడుచున్నదో
నాఁగ వనప్రదేశమున నవ్యలతోన్నతదివ్యడోలలం
దూఁగుల తాంగిఁ జూచి మన మూఁగఁగ నూయలభంగి నెంతయున్.

కం. లావణ్యాంబుధివిచల
త్పీవరకుచకుంభయుగ్మవిలసిత నయ్యా
రే వీచీత్రివళిం గని
భావజపరతంత్రుడయ్యెఁ బ్రబ్బిన వేడ్కన్. 15

కం. మనమునఁగోం కుదయించినఁ
గనువేదుఱు పైకొనంగఁ గన్నులవిల్తుం
డనుపమ సూనాంబకమయ
వననిధిలో ముంచివైచె వానిం గడిమిన్. 16

గీ. మరలె నింటికి సఖులతో మదనసేన
జగతిఁ బర్వెనఘనతమశ్చయముతోడ
ధర్మదత్తుని మానసస్థలమునందుఁ
గ్రమ్ముకొనె నంత మోహాంధకారపటలి. 17

గీ. తెఱవదర్శనభాగ్యంబు మఱుఁగుపడఁగ
ధర్మదత్తుని హృదయకేదారసీమ
నధికతరమోహబీజంబు లంకురించె
నెట్టు లిలుసేరెనో యాతఁ డెవనికెఱుక? 18

గీ. ఇంతిముఖకాంతిచేత జయింపఁబడుచు
త్రపను మబ్బులమాటున దాఁగియున్న
తుహినకరుఁ డింతి వెడలుట తొంగిచూచి
బయటపడినాఁడనంగ సంభ్రమునఁదోఁచె. 19

ఉ. కంటికినిద్రలేదు, హితకాండముపల్కు వినంగనొల్లఁ, డా
కంటికి, నన్నమంచనఁడు, కంటికినంటినవస్తువెల్ల వా
ల్గంటి యటంచు నెంచు నెటులన్ నరమాత్రుఁ డదల్పనోపు ము
క్కంటిమె తుంటవిల్తువిశిఖంబుల కోపఁడనంగ నద్దిరా! 20

కం. వేగుచు మదనానలమున
వేగించెను రాత్రియెల్ల వేగుంబోవన్
వేగిపయినెక్కి వేగము
యేగె మదనసేన నడుగ నేతద్యనికిన్. 21

శా. రాకారాజును ద్రోసిగాజనెడు వక్త్రింబెంతయున్ వెల్గ సం
ధ్యాకాలంబున నెచ్చెలుల్గొలువ నుద్యత్ప్రీతిసంధిల్లఁగా
నాకన్యామణివచ్చె నవ్వనవిహారాసక్తిమైధర్మద
త్తేకాంతోన్నతమైనప్రేమఁగని యెంతే దాపుగానేగుచున్. 22

శా. సత్కారంబిడు నీకరాబ్జయుగళీసంశ్లేషవిస్ఫూర్తితో
మత్కాయంబున గోలతాంగి! నినుఁ బ్రేమంజూచి, యున్నాఁడఁగా
సోత్కంఠ్యంబున ధర్మదత్తుఁడనుధర్మాత్ముండ నింజూడకే
యత్కించిత్కలయేని నిల్వఁగలనా! యంభోజపత్రేక్షణా. 23

కం. నీవచనామృతలేశము
నాపీనుంగవను నింపి నళినదళాక్షీ!
జీవంబుల నిలుపుము నీ
పావనపదపద్మసేవఁ బచరింతుఁగదే. 24

చ. అన విని యాలతాంగి మనమందు నెదుర్పఁగరానితాపముల్
పెనఁగొనఁగొంత శాంతిగొని పేరిమిమాటలచొప్పెలర్పఁగా
ననెనిటు ధర్మదత్తుఁడనునాహ్వయ మేగతి నీకు సార్థమ
య్యెనొకొ యధర్మదత్తుఁడనుపే ఘనధర్మమధర్మవర్తనా! 25

ఉ. మాన్యుఁడు చంద్రవర్మ గుణమండనసంచయమండితుండు మూ
ర్ధన్యుఁడు సార్థవాహనికరమ్ములఁగాఁగలభర్తనాకు నేఁ
గన్యనుసుమ్ము కాక పరకాంతను, గూడనిపల్కుదొట్టి, దౌ
ర్జన్యపుఁబల్కులన్విడిచి సత్పథమందుఁ జరింపనెంచుమా! 26

కం. సత్పథమంద చరించెద
నుత్పలదళచారునేత్ర! యుదితాభీష్టం
బుత్పాటింతువయేనిన్
త్వత్పదతాడనలచేత ధన్యాత్మునిఁగాన్. 27

కం. చేయుమటంచు మఱచి నిజ
కాయంబును బైఁబడంగఁగడఁగినయంతన్
ధీయుతధైర్యంబున బో
ధాయత్తమతిని వచించె నతనిమరల్పన్. 28

ఉ. పిన్నటనాఁటఁదండ్రి, యటుపిమ్మటభర్త, సుతుండుపిమ్మటన్
గన్నఁబ్రోతు, రింతులను, గాదనరా, దిదిధర్మశాస్త్రము
న్నన్న! స్వతంత్రబుద్ధి, పరిహాసపదంబగుస్త్రీకిఁ, జెల్లనేన్
మన్ననమిన్న నేకమయి మ్రగ్గగదే ప్రళయంబువెల్లునన్. 29

కం. అదియటులుంచుము నామది
యిదివఱకేదత్తమయ్యె నింక వివాహం
బుదితముకాఁగలదోయీ!
పదిదినములలోన నాకుఁబణ్యాజీవా! 30

కం. కన్యాదానఫలంబున
ధన్యాత్ముఁడనగుదునంచుఁ దలపోసెదు మా
జన్యున కడ్డముగలదే
యన్యాయపుటూహవిడిచి యరుగుము శఠుఁడా! 31

కం. తరుణులకుం గఱవగునే
ధరణీతల మింతవెలుపుఁదనమున వెలయన్
బరకాంతఁగోరుకంటెను
దురితము వేఱున్నదొక్కొ ధూర్తవతంసా! 32

ఉ. వారిరుహాయతాక్షి నయవర్తనమొప్పఁగ బల్కుపల్కులం
దార! యొకండుగూడఁ జెవియందుఁ జొఱంబడదయ్యెఁదోడనే
మారనిశాతమార్గణసమాజవిభిన్నహృదబ్జుఁడై బలా
త్కారమొనర్చుచేష్టలను దత్పరుఁడై కనుపట్టుపట్టునన్. 33

కం. కామార్తుండగువానినిఁ
గామారియు మాన్పలేఁడు కావున నిపుడేన్
బ్రేమాలాపంబుల నిజ
ధామోన్ముఖుఁజేయుదునని తలఁచి వెరవునన్. 34

చ. పలుకులు వేయునేల గుణవంతుఁడ! కాదనరాదు నిన్నుఁ బెం
డిలి జనకుండు సల్పుటకు నేటనొ రేపటనో ముహూర్తముం
దెలుపుడుచేసె నాపలుకుఁదియ్యము నెయ్యము నాలకింపుమా
పలుక నసత్యమి త్తనువు బ్రాసిన యేఁ బడిస్పుటోన్నతిన్. 35

కం. నోరెఱుఁగని పశువే మును
మారాడదు వ్యాఘ్రమునకు మాయురే! నరులిం
కేరీతిఁ బలుక నేర్తు ర
సారామృతమైనమాట సారచరిత్రా! 36

కం. సత్యంబు పరమధర్మము
సత్యస్తంభమున జగతి సర్వము నిలుచున్
సత్యముపలుకని నోరది
యత్యర్థముఁ బందినోర యాపణికవరా! 37

కం. మండనము సత్యవాక్కు మ
ఖండుడవచింప కరుదెంతు నోడఁగూడిననా
పెండిలిదైన వెనుక ను
ద్దండచరిత్రా, త్వదీప్సితంబును దీర్పన్. 38

ఉ. నాఁడునునాఁడు భేదము లనంతముగా నెసకొల్పి పూర్వపుం
బోఁడిమి రూపుమాపుటకు భూస్థలిఁబుట్టిన పాపజాతి బల్
గోడును జెంది ఘోరనరకకూపమునంబడి విహ్వలించునో
యాడెడనేన్ మృషావచన మన్నరకంబునఁగూలి ప్రమగ్గదన్. 39

కం. కొండెము లధికారులకడ
దండిగవచియించి వారి దయనుగొనెడు బల్
దుండగు లేనరకంబున
నుండుదు రం దుండు నన్నృత మొక్కఁడు వలుకన్. 40

ఉ. తల్లినిఁదండ్రినిన్ హితుల దైవమునున్ సుజనాళిఁ బెద్దలన్
బ్రల్లదముల్ వచించి పలుబాధల బెట్టెడు దుష్టచిత్తు లే
క్షుల్లకనారకవ్యథలఁ గూరి నశింతురొ పుణ్యరాశికిన్
డెల్లి యదేగతిన్ బొలియనేరుతు బొంకులు వల్కనేర్చినన్. 41

కం. అధికారగర్వమూని స
మధికసమానత్వగుణమునందని వారే
వ్యథగలనరకంబునఁబడి
వ్యధితులగుదు రందె పడుదు నస్పృశములాడన్. 42

కం. అనుచు సమాధానవచన
మునుంబలుకు మదనసేనమోముంగని ప
క్కనసగి యనె వనితా! ముసు
విన మిట్టిశపథము నిలువఁ బెట్టినవారిన్. 43

గీ. సత్యవాక్పూర్తికి భవదాస్యమునురంగ
భూమిఁదాండవించుటగని మోదవార్ధి
మునిఁగిపోయె నామన మింకఁ బోయిరమ్మ
యిప్పుడాడినశపథంబు దప్పకుండ. 44

ఉ. కడచితి గండమంచు నధికంబగుమోదమునందుచుండి యె
వ్వడువున ముందుగండమును బాయఁగ నేర్తునటంచు ఖేదమున్
గుడుచుచు నంత ధైర్యమునుగొయ్యను మాతఁగఁగొంచు లోకముల్
నడపెడుతండ్రిలేఁడె? యని నాతి గృహంబును జేరె నంతటన్. 45

కం. కుశలుఁడు ధనదత్తుఁడు ము
ద్వేశుఁడై యాత్మజను చంద్రవర్మకుఁ జంచ
ద్విభునకు "దశపూర్వేషాం
దశాఽపరేషా" మటంచు ధారంబోసెన్. 46

చ. కలువడముల్ రచించి పయికప్పనగొప్పగ గుప్పుగుప్పనన్
వెలువడుకప్పురంపుసిరి నించిరి కంకటిఁబట్టుపుట్టపుం
దలిమముఁగూర్చి రింక బహుభాగణుతింపఁగనేల యండముల్
జిలిబిలియైచెలంగు పవళింపుబిడారునఁ జేర్చి రంగనన్ 47

ఉ. అంతకుమున్నె వాన్పుపయి నాసల నువ్విళులూరుచున్నయ
క్కాంతమగండు మెండుకొనుకౌతుకలక్ష్మి లతాంగి నర్మిలిన్
జెంతకుఁజేర్పఁబోవ నిరుసేతుల 'నిల్వుఁడునిల్వుఁ'డంచు న
క్కాంత వచించె నంత నిజకాంతునిఁగండియు గాఁడిపాఱఁగన్. 48

చ. పదముల గద్గదస్వనముఁ బాదయుగంబునఁ దొట్రుపాటునున్
వదనమునందు విన్ననగుభావము ముప్పిరిగా నయోమయా
స్పదమగుమన్స్థితింబడి విచారణఁ సేయఁగలేమి భర్తదాఁ
దుదకిదియేమొ! యేమెయిది! తొయ్యలి! యేమిదియేమియేమనెన్.

చ. కులమును, రూపమున్, గుణము, కోపిదభావము, ధీవిశేషమున్
సలలితభాగ్యముల్, గలవు జవ్వని! లోపములెందుఁగల్గునే
పలుకుమ! ప్రేమరాజ్యపరిపాలన చేయుమటంచు భర్తయుం
బలికెడిచో 'నవక్తినచపశ్యతి' యాసతి ఱాతిపోతమో: 50

ఉ. కోపప్రుటగ్ని తత్ హృదయకుండములోపలఁ బ్రజ్వరిల్లి యే
వైపును దావులేక పెడఁబాయఁ బెఠిల్లుచుఁ బ్రేలుచుండ నో
పాపపురాశి! యోకుటిలభామిని! నాయెడఁబ్రేమలేదు పో
వే! పతితాత్మురాల! భవదిచ్ఛఁజరింపఁనటంచుఁ బల్కినన్. 51

ఉ. సారసపత్రనేత్ర బహుసాధ్వసపూరితలోచనంబులన్
దేఱినచూపుపౌజులను దేపకుఁదేపకుఁబర్వఁజేసి యే
పారినలజ్జపెంపున ముఖాంబురుహంబును వంచి యంత నా
దార యుదారవాక్యసముదాయమునన్ బతిఁగూర్చి యిట్లనున్. 52

ఉ. వీనులవిచ్చుచున్ వినఁగ వేడెద విస్మృతినందకుండ నా
థా! నయధీననాథ! పతిధాత, యతండె యుపేంద్రుఁ, డాతఁడే
శానుఁడతండె యేడుగడ, సర్వమతండె, యటన్న ధర్మమున్
నేను గ్రహింపకున్నయది సీతనుగానుజుమీ త్రిశుద్ధిగన్. 53

కం. సాక్షాన్నారాయణుఁడత
డక్షయమోక్షప్రదాత యంగనకున్ బ్ర
త్యక్షపుదైవము పతిని స
మీక్షింపని జీవితంబులేటికి సతికిన్. 54

కం. ఆయారీతిగ నెంచినఁ
జేయందగినట్టి దెల్లఁ జేయఁగఁబడు లే
చేయందగినది యిఁక నే
చాయంగను గొన్నలేదు జాయకు జగతిన్. 55

గీ. భర్తృసంభాషణంబును భర్తృదాస్య
మివ్వినాకు మిగిలియున్న వీద్వయంబు
పరమలోకసంప్రాప్తికిఁ బట్టభంగ
సరణియంచు నెఱుంగనిచానఁగాను. 56

మ. కరుణాసాగర! యొక్కనాఁడొక వణిక్కాంతుండు మోహాంధుఁడై
త్వరతోడన్ ననుజూచి కోరఁగుపితస్వాంతంబునన్ వానికిన్
జరబోధంబొనరింప నే నతఁడు కానీ నిన్ను బోనిత్తునే
తరుణీయంచు బలాత్కరించుటకు సిద్ధంబౌనెడన్ భీతనై. 57

కం. పదిదినములలోఁ బరిణయ
మదిజరిగిన వెనుక వచ్చి యమలస్వాంతా!
కదిసెద నిన్నని శపథం
బదవదయొదవఁగ వదించి తప్పెడు, నాథా! 58

శా. ప్రాయశ్చిత్తమదెంతపాపమునకేన్ బాహాటమై చెప్పి రా
మ్నాయవ్రాతములందు బొంకువలనన్ బ్రాప్తించు పాపాగ్ని నే
చాయంజూచిన నార్పనేర్పుగలచంచన్మేఘమొండున్న యే
లా యీకాయము సత్యవాక్యముల నుల్లంఘింపఁ బ్రాణేశ్వరా! 59

చ. అనివచియించుజాయపలు కాత్మఁదలంచుచు భర్త హాసముం
బొనరిచె నింతమూర్ఖలగు పొల్తులుపాల్పడ చేయుటంచునో
గొనకొని సత్యవాక్యమునకున్ జయమబ్బక యెట్టులుండు నం
చునొ వనితాసతీత్వమును జూచెదఁగాక యటంచునో కదా! 60

చ. అనఘుఁడు ధీరమానసుఁ డహంకృతిదూరుఁడు భర్త హాసముం
బొనరుపఁజూచి భార్య యదెపో పతియాజ్ఞయటంచునెంచి వై
శ్యునిసదనంబుఁ జేరఁజని శుద్ధమనస్కుఁడ! నేను మాటచొ
ప్పునఁ జనుదెంచితిన్ బలికి బొంకనిదాననటంచుఁ బల్కినన్. 61

గీ. తరుణితెగువకు సత్యసంధానమునకు
నద్భుతానందచిత్తుఁడై యతఁడు మున్ను
చేసినప్రసంగముల కెగ్గుసిగ్గులంది
కేలుగవ నామెపాదాలఁ గీలుకొలుపె. 62

ఆ. వె. పుట్టిబుద్ధిమెఱిఁగి గట్టెక్క నిన్నియేం
డ్లిట్టిసత్యవాణి నిట్టిసాధ్వి
నెట్టిపట్లఁగాని పట్టచూడఁగలేదు
వట్టిదీనుఁ బ్రోవు వనిత! యనియె. 63

చ. శివ! శివ! యిట్టిమాట చెవిచిల్లులుపోవఁగఁబల్కకమ్మ యే
పవిదినిఁ బూర్వసంజనితపాపముఁ బాపుకొనంగనేర్తు భూ
పవరుఁడు రామచంద్రుఁడు కృపాపరచిత్తుఁడు తీర్పుచెప్ప నే
ర్పువరలువాఁడు రమ్మనుచు బోటినిఁదోడ్కొనివచ్చుచుండెడిన్. 64

శా. సీతన్ రావణుఁడేమిచేయ గలిగెన్ జేపట్టఁగానెంచి సం
ప్రీతిన్ బ్రాహ్మణుఁడేమియయ్యె రఘుభూమీపాలు ప్రాణేశ్వరిన్
బ్రీతింగోరి కిరాతుఁడేడ దమయంతింగోరి యెక్కాలమున్
బాతివ్రత్య మహాప్రభావమునకున్ భంగంబు వాటిల్లునే? 65

గీ. వేదవేదాంగవిదులైన విప్రవరులు
లంబికాయోగసంసిద్ధులను ప్రసిద్ధి
గాంచిన మునీంద్రులును ధిషణాంచితులగు
సచివవర్యులుండిన సభాస్థలమునందు. 66

కం. ఒకటే పలికెడు వాక్యం
బొకటే బాణంబు భార్యయొకతియ యగుచున్
సకలాంతర్యామికిఁ దా
సకలుషబింబమన రాముఁడలరుచునుండెన్. 67

చ. తొలుతను ధర్మదత్తునకుఁ దొయ్యలినూటయొసంగె నంతకున్
దొలుతన యాపెతండ్రి పరితోషముమీఱఁగఁ జంద్రవర్మ క
ర్మిలి నిడ నిశ్చయించెఁ గృప రెక్కొన నిందలిధర్మసూక్ష్మమున్
దెలుపుఁడటంచుఁ గాంతె యరుదెంచెడినంచు శుకంబు పల్కఁగన్.

గీ. ధర్మదత్తుండువచ్చి తద్ధరణినాథు
దర్శనముచేసె నంతలోఁదరలిపోయెఁ
బాపపుంజంబు ప్రళయఝంఝూపవన హ
తులను ఘనతూలజాలంబు దూలుభంగి. 69

ఉ. రాముఁడు వారిఁగాంచి కృపరాజిల నాంతరదృష్టిఁజూచి దు
ష్కామవికారచేష్ట మెయిఁగాంతనుగోరితిగాని స్వీయపుం
ధామముచేరుపిమ్మట యథార్థము న్యాయమెఱింగి తత్పరం
ధాముని బాపముక్తికయి ధ్యానమొనర్చితిగాదె బాలకా! 70

ఉ. కన్నియ యస్వతంత్రయనుకారికయూరకపోవ దాపయిన్
బిన్నది, శండ్రిచాటుది, ప్రభీతినిఁగాని త్రిశుద్ధి మీఱ ని
న్నెన్నఁడుఁ గోరనట్టిది, యహీనచరిత్రము దాల్చియున్నదీ
కన్నియ మున్నె దత్తయయి క్రాలుచునున్నదిగాదె, బాలకా! 71

సీ. పలుకకున్నను మనసుచే వాక్కుచేతఁ
బొలఁతి యంగీకరించెనాఁ దలఁతువేమొ
మనము, వాక్కును, కాయంబు ననెడు మూట
మానసమెకాదె మిగుల ప్రధానమగుట. 72

శా. లూలామాలపు సంస్కృతింబడుటకుఁ, లోఁగొంటకున్ సూక్ష్మమున్
మూలం బాత్మయొకండ కాన మనసే ముఖ్యంబనుమ్మా వచ
స్ఖాలిత్యంబునకంటె దోషదము, దుస్సాధంబుఁగట్టా! మన
స్స్ఖాలిత్యం బదిలేనివాఁడు ఘనుఁ డీక్ష్మామండలిన్ బాలకా! 73

కం. క్షుబ్ధహృదయుఁడగు నాతఁడు
స్తబ్ధుండయి రామవచనసంచయమునకుఁ
లబ్ధజ్ఞానుండయి ప్రా
రబ్ధంబును విడిచిపుచ్చి రామావనిపా! 74

మ. అపరాధంబుననైన పాపజలధుల్ వ్యత్యస్తమైపోయె నీ
వపురాదర్శనజాతభాగ్యమహిమన్ భాస్వత్సతీత్వంబునం
దుపమాతీతను నీమెఁదల్లియని నాయుల్లంబునందెంతు నె
ల్లపుడంచున్ గరముల్ మొగిడ్చెనపుడా వ్యాపారి శుద్ధాత్ముఁడై.

కం. రాముని దర్శించిన శ్రీ
రామా! యని యొక్కపరి పరాకున ననినన్
రామాయణంబుఁ జదివిన
నామూలము గూలుఁగాదె యఘశైలంబుల్. 76

గ్రంథాంతము.

కం. శ్రీకొండమంచిలిపురవా
సీ! కవితారసఝరీనిషేవణదక్షా!
ధీకలిత! నిరాడంబర!
పాకప్రతిపక్షతుల్య వైభవశాలీ! 77

శా. శుంభద్దానకుశేశయాప్తతనుజా! శుభ్రాంశు, జీమూతరా,
డంభస్సార, మరాళ, ఫేన, రజతాహార్య, ద్విపేంద్రద్విష
చ్ఛంభూ, చ్చైచ్చ్రవ, కుంభిదంత, ధవళస్తంభేరమ, ద్యోధునీ,
దంభోళి, త్రిదివద్రుమసన్నిభయశోధామా! ప్రలబ్ధక్షమా! 78

మాలిని. మహిధరసమధీరా! మాననీయప్రచారా!
సహీనవచన విదూరా! నాగమాంబా కుమారా!
సహన వినయశీలా! సత్కవిత్వాబ్ధి డోలా!
మహిత సుగుణసాంద్రా! మన్నెవంశాబ్ధిచంద్రా! 79

గద్య

ఇది శ్రీమత్కౌండిన్యస గోత్ర శిష్టావంశ కలశవారాశి రాకాకైరవ
మిత్ర పవిత్రచరిత్ర నరసమాంబా సూర్యనారాయణశాస్త్రి
పుత్ర రాజకుమార్ ఆఫ్ భద్రాచలము శ్రీరాజా
వేంకటనరసింహాప్పరాయ సవాయశ్వారావు
బహదర్ ప్రదత్త కవిభూషణ బిరుదాంకిత
వేంకటసుబ్బయనామధేయ ప్రణీతాంధ్ర
దూర్వాస రామాయణము
సంపూర్ణము.

మెజెస్టిక్ ప్రెస్, రాజమండ్రి.